# సీత-రాధమ్మ

దగుమర్తి రామారావు



త్రివేణీ పబ్లిషర్సు
మచిలీపట్టణము

# పరిచయము

'సీత - రాధమ్మ' — ఇవి రెండు కథలు. వీనికర్త శ్రీ దిగుమర్తి రామారావు, ఎం. ఎ., ఎల్ ఎల్. బి. గారు. సుమారు పాతిక సంవత్సరాలకు పూర్వము వీరితో నాకు పరిచయభాగ్యము కలిగింది. అప్పుడే వారు చిన్న చిన్న రచనలు చేస్తున్నారు. నేటి రచయితలపై వారికి అభిమానం అధికంగా ఉంటూండేది. వారు సౌజన్యమూర్తి. సున్నితమైన మనస్సు వారిది. తరువాత వారు పెద్ద పరీక్షలలో ఉత్తీర్ణులైనారు. న్యాయవాదవృత్తి వారికి నచ్చలేదు. పత్రికా రచయితల పరీక్ష పంజాబు విశ్వకళాపరిషత్తులో చదివి ఉత్తీర్ణులైనారు. అనేక ఇంగ్లీషు పత్రికలకు కొన్ని తెలుగు పత్రికలకూ తమ రచనలు పంపుతూ ఉన్నారు. ద్వివిధముగా కీర్తి గడించుకొంటున్నారు. 'Land Problem' మీద వారు వ్రాసిన ఒక ఇంగ్లీషు గ్రంథము బొంబాయి నుండి వెలువడింది. ఈ విషయములన్నీ నేను వ్రాయడానికి కారణము వారు ప్రతిభాశాలి అని చెప్పడానికే.

'సీత' — ఇది ఒక కథ. దీనిని కథ అనేబదులు Sketch అంటే బాగుంటుంది. ఇందులో కథావస్తువు లేదనే చెప్పాలి. ఇందులో ఉన్నది నూతన దంపతుల ఇష్టాగోష్ఠి.

"కథ చదివావా, ఎలాగుంది? ... నవ్వుతా వెందుకూ?"
"ఇట్లా రాశారేమిటి! పోనిస్తురూ, రోజూ మాట్లాడుకునే సంగతులన్నీ కథలో రాయడం ఎందుకూ?"

'సీత' లో భార్యాభర్తలు రోజూ మాట్లాడుకొనే సంగతులు రామారావుగారు ఉల్లేఖించారు.

"సాయంకాలం, సీతతో వాళ్ళమ్మమ్మ 'ఇదేమి చోద్యమే, రోజంతా నీ మొగుడితో ముచ్చటలతోనే సరిపోతూంది; ఆవుకి పాలు పితికి, దీపాలు వెలిగించు' అంటుంది."

మొగుడితో భార్య ముచ్చట్లూ, భార్యతో మొగుడి ముచ్చట్లూ — ఈ గ్రంథంనిండా ఉన్నవి.

పది సంవత్సరముల బాలిక ఈ కథ చదివి బాగులేదంది. ఇరవై సంవత్సరముల యువకుడు చదివి బాగుందన్నాడు. నాబోటి ముసలివాళ్ళకు సుప్తస్మృతులు మేల్కొంటవి. ఈకథలో మన తెలుగు సాంసారిక జీవనము ప్రతిబింబిస్తూ ఉన్నది.

ఇట్టి 'రాధమ్మ' కథలోనూ తెలుగు సాంసారిక జీవనము కళ్ళకు కట్టినట్లు శ్రీ రామారావుగారు చిత్రించారు. ఇందులో కథావస్తువు కించిత్తు ఉంది — సత్యం తల్లిని పోగొట్టుకొని, శాఖాభేదము లెక్కచేయక, రాధమ్మను ఓంతల్లి కొడుకు మాత్రి పెళ్ళి చేసుకోవడం. పాపం, రాధమ్మ భర్త గతించడం మనకు విచారం కలిగిస్తుంది. ఆమెతో మనకింత పరిచయం కలిగించారు గ్రంథకర్త. రాధమ్మపై సత్యానికిగల అమాయకపు ప్రేమ, రాధమ్మ సౌశీల్యము, జగన్నాథం మంచితనం, సత్యం అమ్మ అమ్మమ్మల కలిసిగట్టుతనం — ఇవన్నీ మెచ్చుకోదగ్గవి.

ఈకథలు ఉద్రేకాన్ని కలిగించవు. మనస్సును కలతపెట్టవు. పెద్ద సమస్యలను చిత్రించవు. నదీజలాలవలె జారిపోతూ ఉంటవి. తెలుగు సంసారాల శాంతజీవనమును ప్రతిబింబింప చేస్తూ ఉంటవి. వీటికి సారస్వతములో ఉచితమైన స్థానమున్నది.

నర్సాపురం
19-12-55

చింతా దీక్షితులు

# సీత

## ౧

తెరిపి లేకుండా అదే వాన; ఇవాళ్టికి అయిదో రోజు. కిటికీలోంచి పైకి చూస్తూ మంచంమీద కూర్చున్నాను. టపటపమని కిటికీ సిమెంటు రేకుమీద ఇంటి చూరునుంచి చినుకులు అవిరామంగా పడుతున్నాయి. రేకు చివరనుంచి వరసగా ఎన్నో నీటిధారలు ఒక్కసారైనా ఆగకుండా తదేకధారగా పడుతున్నాయి. కనిపించినంతవరకూ అంతా వానే; ఎటువేపుచూసినా నీరే. దూరాన్ని, కాలువ అవతల ఎవరో తాటాకు గొడుగు వేసుకు వెళుతున్నారు. ఆ ఏకాంత బాటసారి తప్ప, యింకెవ్వరి సంచలనమూ లేదు. ఒక్కసారి ఘుమ్మని నోరూరేలా వాసన వేసింది. వెనక్కి తిరిగి చూశాను. మంచం రెండోపక్క బల్లమీద కాఫీ, ఫలహారం పెట్టి, సీత నిల్చుంది. "ఏమిటలా చూస్తున్నారు?" "ఏమీ లేదు; వానచూస్తున్నాను. చాలా సేపై నిల్చున్నావేమిటి?"

"లేదండీ, యిప్పుడే వచ్చాను."

"కూర్చో సీతా."

"అలాగే; పుచ్చుకోండి, చల్లారిపోతుంది."

"నువ్వూ యిక్కడే ఫలహారం చెయ్యకూడదూ?"

"వస్తా, వంటింట్లో కొంచెం పనివుంది."

"సరే, వచ్చాక తెలుపువ్వాలి సుమా!"

"ఊఁ" సీత వెళ్ళిపోయింది...

హెచ్చుతగ్గులు లేకుండా ఒక్కలాగే అదే శబ్దంతో కురుస్తూన్న వాన మళ్ళీ చూస్తూకూర్చున్నాను. సీతవచ్చి తలకి నూనెరాసి, దువ్వడం మొదలుపెట్టింది. తల దువ్వుతూంటే నాకు నిద్రవచ్చేస్తుంది. చిన్నప్పుడు అమ్మకూడా ఏమీ సొప్పెట్టకుండా చాలాసేపు దువ్వేది. కొన్నాళ్ళకి అక్కయ్య నోసారి దువ్వమన్నాను; 'మొగెప్పుడూ దువ్వమనకూడదురా' అనుకున్నాను.

"దువ్వడం అయింది; అద్దంలో చూసుకోండి."

"అప్పుడే అయిపోయిందీ; మరికొంచెం సేపు దువ్వేదూ, హాయిగావుంది."

"పాపిడి సరింగా వచ్చేసిందండీ; యింక దువ్వితే చెరిగిపోతుంది."

"పరవాలేదు; కావలిస్తే చెరిపేసి మళ్ళీ దువ్వు."

"బాగుంది; ఏం ఆలోచనలండీ!"

సీత లోపలికి వెళ్ళిపోయింది...

కొంచెంసేపుండి, ఏమిచేస్తూందో చూద్దామని

వెళ్లాను. చాపమీద కూర్చుని తల దువ్వుకుంటూంది.

"నేను సిగముడి వేసేదా?"

"పాపిడంతా కలిపేసి, అప్పట్లాగ జుట్టంతా చిక్కు పెట్టేస్తారు."

"కావలిస్తే అద్దంలో చూస్తూండు. ఈసారు బాగా సిగ చుట్టకపోతే అప్పుడను."

"దువ్వుకోవడ మయిపోయింది; పువ్వులు పెట్టుకోవడమే."

"ఆయిహోయి; మల్లెపువ్వులెక్కడివి?"

"మన పెరట్లోవే."

"మన పెరట్లో మల్లెమొక్కెక్కడుందీ?"

"గన్నేరుచెట్టువార లేవుటండీ?"

"అహా. ఉన్నాయి కాంసు కాని, రాత్రి నేను కూడా వండడానికి వచ్చేదా?"

"మీరెందుకూ, ఏదో రాసుకోవాలన్నారూ?"

"రాసుకోవాలి కాని, ఒక్క రిపీ వండాలి, చిరాగ్గావుంటుందేమో."

"అబ్బే, చిరాకేమిటి? ఇద్దరికి వండడం ఓ పెద్దపనా? మీరొస్తే, అన్నిట్లో ఏదో ఒకటి ఎచ్చో తక్కువో పడుతుందికూడాను."

"పోనీలే, నీకంత యిష్టంలేకపోతే."

"ఇష్టాని కేముందండీ, మీా కెందు కీ యిబ్బందని అన్నానుగాని?"

"సరేకాని, పప్పులుసు వండేం?"

"అలాగే; ఏఁకూర వండేది?"

"నీ కిష్టమైనది వండు."

"అన్నట్టు దేముడి గూట్లో దీపం వెలిగించాలి"...

ఇందాక గాలివచ్చి మేఘాలు కొంచెం చెదిరి పోయాయి. అక్కడక్కడ చుక్కలు కనిపించాయి కూడాను; కాని, మళ్లీ జల్లువచ్చేటట్టుందే. లాంతరు వెలిగించి, బల్లమీాద పెట్టి, రాయడానికి కూర్చున్నాను. ఉండుండి చలిగాలి వీస్తూంది. బెకబెకమని కప్పల చప్పుడూ, రివ్‌రివ్‌మని గాలిశబ్దం తప్ప ఈనిశ్శబ్దమైన రాత్రికి మరే అంతరాయం లేదు. ఇప్పుడేమిటి రాయడం? నేను సరిగ్గా అరగంటకూర్చుని రాయలేను. పుస్తకం, కలం అక్కడ పడేసి, వంటింటి గడపవద్దకు వెళ్ళాను. పొయ్యిలో మంట వెచ్చగా నిబ్బరంగా రకరకాల నాట్యం చేస్తూంది. పక్కనే నల్లపిల్లి కళ్లు మూసుకుని నిశ్చింతగా పడుకుంది.

"ఏం, రాయకుండా వచ్చారు?"

"పులుసువాసన వేశాక మరి వుండలేక

పోయాను. నీ కెవరు సీతా, యింత బాగా వంట నేర్పారు?''

''అమ్మ.''

''మీ అమ్మ వండుతూంటే రోజూ నేర్చుకునే దానివికదూ. పెళ్లీడు అమ్మాయిలంతా యిలాంటి పనులే నేర్చుకుంటూంటారు. కాపరానికి వెళ్లేముందు అక్కయ్యకూడా అంతే.''

''వదినె చాలా పొదుపుగా వండుతుంది; ఆ నేర్పు మరెవరికీ లేదు.''

''ఏమినేర్పో కాని, నీవంటంత రుచిమాత్రం వుండదు.''

''అవును, పొరుగింటి పుల్లకూర రుచి.''

''అదేమో; మీయింట్లో ఉన్నంతరుచిగా నాకు మరెక్కడా వుండదు. ఎలాగైనా మీ అమ్మ చాలా బాగా వండుతుంది.''

''అమ్మకంటే అమ్మమ్మవంట ఇంకా బాగుంటుంది.''

''అలాగా; కరివేపాకుపచ్చడి మటుకు మా అమ్మ చాలా కమ్మగా చేస్తుంది.''

''అవును; అత్తయ్యకన్నీ చేతనవును. ఏదైనా కమ్మగా వండుతారు.''

పిల్లి కళ్లు తెరిచింది. ఒకసారి పొడుగ్గాను,

ఒకసారి నిలువుగాను సాగి ఒళ్లు విరుచుకొని, ఆవలించి నావేపు అనుమానంతో చూసి 'మ్యాఁవ్' అంటూ సీతదగ్గరకి వెళ్ళింది. సీతంటే దానికి భయమూ లేదు, అనుమానమూ లేదు. ఎప్పుడూ వెనకాలే కాళ్ళలోనూ, చీరెలోనూ పడుతూ చనువుగా తిరుగుతుంది. 'ఛీ, ఇష్' అని సీత దాన్ని బెదిరిస్తుంది, కాని అది కళ్ళుమూసు కుని అక్కడే మళ్లీ నక్కి కూర్చుంటుంది. సీత కోంబడ డంకాని, కోపం తెచ్చుకోవడంకాని నాకు గుర్తే లేదు. ఆ పిల్లినే ఎప్పుడేనా, చాలా చిరాకు వేసి నప్పుడు, చీపురుతో కొడుతుంది. గట్టిగా కొట్టాననుకుంటుంది కాబోలు! అప్పుడామె కోపంచూస్తే నాకు చెప్పతరంకాని నవ్వు వస్తుంది...

''వంటయింది ; ముడికట్టుకోండి.''

''ఇద్దరం కలిసే భోజనం చేదాం.''

''అలాగే.''

''అన్నట్టు ఏం కూర వండేవు ? నూ కమ్మని వాసన వేస్తూంది.''

''పోల్చుకుందురు కాని, వుండండిమరి.''

''ఏదో కొత్తమోస్తరు వంటకం చేసినట్టున్నావే !''

పిల్లి నావేపు కోపంతో చూసి, మ్యాఁవ్ అంది.

దానికి భోజనానికి వేళైనా, నేనింకా రావడంలేదని కాంసు దానికి విసుగు...

యథాప్రకారంగా మళ్ళీ ముసురుపట్టింది. ఇంత దాక కొంచెం తెరిపి యిచ్చింది, కాని భోజనం చేసేసరికి నల్లని మేఘాలు ముసుకు వచ్చేశాయి. వాన – ముసురునుంచి కాబోలు, ఈ రాత్రి ఎంత ప్రశాంతంగా వుంది! ఇలా, వెలిసే సూచనలేమీ లేకుండా, వాన కురుస్తూంటే నాకు చాలా సరదా. మిగిలిన ప్రపంచకంతో సంబంధం లేకుండా ఈ గ్రామాన్ని ఈ యింటినీ, నన్ను సీతనీ, వేరుగా, మరుగ్గావుంచినట్టు చేసేస్తుంది వాన. కాని, యింట్లో ప్రతిగదీ దీపమూలో కారుతూన్నట్టే వుంది. సీత వంటిల్లు చక్కబెడుతూంది కాబోలు.

''సీతా!''

''ఆఁ.''

''ఇంటి పనులన్నీ అయ్యాయా?''

''ఇదిగో వస్తున్నా; అయితే కాఫీ పెట్టమన్నా రేమిటి?''

''అబ్బా, ఎంత జ్ఞాపకం వుంచుకున్నావు! మళ్ళీ నీళ్ళు కుంపటిమీద పెట్టాలికాంసు; పోనీలే, రా.''

''నీళ్లు మరుగుతూనే వున్నాయి.''

"ఆఁహా. ఉండు, గుండ వేసేకు. నే నొచ్చి వేస్తా."

లోపలికి వెళ్లాను. సీత వంటిల్లు తుడిచి, అన్నీ చక్కబెట్టి అన్ని తలుపులూ వేసుకుని, మధ్యనట్టింటిలో కుంపటి దగ్గిర ఏదో తింటూ కూర్చుంది. నేను రావడం చూసి మెల్లగా నమలసాగింది.

"అదిగో! నాకివ్వకుండా తినేస్తున్నావు కదూ?"

"అక్కో, జంతికలండి. మొన్న పిన్ని వచ్చినప్పుడు అమ్మ పంపింది. కొంచెం నూనెవాసన వేస్తున్నాయని మీ కివ్వడానికి మొహమాటపడ్డాను."

"పరవాలేదులే. కొంచెం యిద్దూ; జంతికలు తిని చాలా రోజులైంది."

'దానికేంభాగ్యం? రేపు పిండివిసిరించి చేస్తాను లెండి' అంటూ జంతికలజాడీ అల్మారునుంచి తీసుకు వచ్చింది. నేనొక జంతిక విరక్కుండాతీసి తినడం మొదలుపెట్టాను.

"ఏం సీతా, నూనెవాసన...బాగు లేవన్నావు. నాకేవాసనా లేదు; చాలా బాగున్నాయే! చూపిస్తే నీకు దక్కకుండా తినేస్తానని కాబోలు చెప్పావు కావు!"

సీత నవ్వసాగింది. ఆ జంతిక అయిపోగానే, బాగుందంటూ మరోముక్క తీశాను.

''చాల్లెండి. బాగున్నాయని అన్నీ తినేకండి ; ఇవాళ పప్పులుసుకూడాను.''

''ఈ ముక్కొక్కటే తింటాను ; అలాగేనా ? పాపం, నీకోసం ఎంతో ఆపేక్షతో మీఅమ్మ పంపిస్తే, మధ్య నేను తినడం ఏమిటి ? నీ జంతికలన్నీ నేనే తినే శానని నువ్వుకాని ఉత్తరం రాశావంటే మీఅమ్మకి నామీద కోపంరాగలదు.''

''బాగుందండీ ! కావలసినన్ని పుచ్చుకోండి ; యివాళ అన్నీతింటే అరగదని అన్నాను. ఈ జాడీ యిలాగే వుంచేస్తాను. రోజూ మీరే తిందురుగాని. అమ్మ మరీసంతోషిస్తుంది. 'నువ్వు చేసిన జంతికలు చాలా బాగున్నాయిట ; మళ్ళీ చేసి పంపించు' అని ఉత్తరంకూడా రాస్తాను.''

''మీఅమ్మకి జంతికలు చెయ్యడం బాగా వచ్చునేం?''

''జంతికలుచెయ్యడం ఎవరికీ రాదుకాని, ఇంకో గుండవెయ్యండి.''

నేను గరిటతో గుంజతీశాను.

''ఇదంతా వేస్తారేమిటి ? సరిపోయింది ! యిలా తెండి.''

''ఇంతేనా ? చిక్కగావుంటేకాని నాకు సయించదు.''

"కావలసినంత చిక్కగా వుంటుంది; వెయ్యండి."

"ఊఁ. దింపేసేదా?"

"ఉండండి, నే దింపుతా."

"పాలేవీ?"

"అల్మారులో వున్నాయి."

పాలు, పంచదార తీసుకొచ్చాను. సీత కాఫీ కలపడం మొదలుపెట్టింది.

"కాఫీ మా మంచివాసన వేస్తూంది. ఇవాళే గింజలు వేయించి గుండ చేశావేమిటి?"

"లేదే. చల్లర పెట్టాను; ఆగ్లాసిలాయివ్వండి."

"ఇల్లంతా కారుతూంది. పక్క చుట్టేశాను. ఎక్కడ వేసుకుందాం?"

"బీరువాగదిలో కారదేమో?"

"అబ్బా, అక్కడ చలి జోరుగా వేస్తుంది."

"కిటికీ రెక్కలు వేసేద్దాం లెండి. కాఫీ పుచ్చుకోండి."

"కొంచెం నువ్వు పుచ్చుకోవూ?"

"తాగేద్దురూ, మళ్ళీ వంతేమిటి? భోజనం చేశాక నా కలవాటు లేదు."

"అలవాటు కేముంది? నువుకూడా కొంచెం తాగు తేనే కాని..." అప్పుడే మ్యాఁవ్ అంటూ పిల్లి కుంపటిదగ్గిర చేరుకుంది. దాన్ని తోలి, కుంప

తిర్చి, గళాసులూ అవీ ఓమూలపడేసి, ఇద్దరం లాంతరు తీసుకుని వచ్చేశాం. నట్టింటిగది పైనిఘడియవేసి, బీరువాగదిలోకి మంచం తీసుకువెళ్లాం.

పక్కమీద విశ్రమించిన నాకు తాంబూల మందిచ్చి, తానుకూడా వేసుకొని, సీత నాకాళ్ళు పడుతూ కూర్చుంది.

“భార్య కోరికియిచ్చిన తాంబూలం కొంత మంది వేసుకుంటారుట; నిజమే?”

“నాకేం తెలుసు? అయినా, ఎవరైనా వింటే నవ్వి పోతారు; సిగ్గుచేటుమాటలు! వూరుకోండి.”

భోజనాయాసంచేత నాకు కొంచెం కునుకు పట్టింది. మళ్ళీ బాగా తెలివివచ్చింది.

“సీతా!”

“ఊఁ.”

“కాళ్ళుపట్టడం చాలుకాని, ఒకకథ చెప్పవూ?”

“నాకేం కథలొచ్చునండీ?”

“మీఅమ్మ నీకు చిన్నప్పుడు చెప్పలేదూ? ఏదేనా ఒకటి చెబుదూ.”

“అలాగే.”

“రా మరి; దగ్గరగా కూచో. ఆఁ, నవ్వుతున్నావూ; నీదగ్గిర ఎంత మంచివాసన వేస్తూంది!”

"నేనేం అత్తరు రాసుకున్నాననుకనా వెయ్య
డానికి?"

"అత్తరుసంగతి కాదుకాని, సీతల్లో పువ్వుల
సువాసన. నువ్వేచీర కట్టుకున్నా బాగుంటుంది సుమా!
నేను చూడు ఎలాగుంటానో!"

"ఊరుకోండీ, ఎవరేనా వింటే నవ్వుతారు.
కథ వినండి."

"ఊఁ. పోనీ చెప్పు."

"అనగా, అనగా ఓ వూళ్లో ఓ అవ్వవుండే
దిట. ఆ అవ్వకో మనుమరాలు వుండేది. అమ్మాయికి
పదహారు పద్ధెనిమిదేళ్ళు వచ్చేశాయి, యింకా పెళ్ళి
కాలేదుట; కాని, ఆ అమ్మాయి చాలాచక్కనిదీ,
మంచిదీనుట"

"నీ కంటే?"

"నే నొక లెక్కా, ఆ పిల్లముందు!"

"కాదు. నీ ముందే ఆపిల్ల పనికిరాదు."

"బాగానేవుంది! కథ చెప్పనివ్వరా ఏమిటి?"

"ఆపిల్ల బాగుంటే పెళ్లెందుకు కాలేదు?"

"బాగుంటే పెళ్లైపోతుందీ? ఎన్నిసమకూడాలి!
సొమ్మూ, అదీ ఉండొద్దూ? అలావుండగా, ఓరోజు
వాళ్ళింటికొకయతీశ్వరుడు వచ్చాడుట. అతనికి వాళ్లో

బాగా సేవచేసి, మంచి మిఠాయిలూ కమ్మని వంట కాలూ, పంచభక్ష్య పరమాన్నాలతో భోజనం పెట్టారు.''

''రేపు ఏదేనా మంచిది, తీపిది చేద్దూ.''

''బొత్తిగా చంటిపిల్లలై పోతున్నారండీ!''

''నాకు నోరూరుతూంది మరి.''

''చిన్నముక్క. పాకంజీడిపప్పుంది; ఇచ్చే దేమిటి?'' ఒక్కసారి ఉత్సాహంతో లేచాను. సీత ఎక్కడినుంచో తెచ్చి ఇచ్చింది.

''ఎక్కడిది సీతా?''

''ఎప్పటిదో కొంచెం ఉంది. అది తెచ్చాను.''

''చిన్నప్పుడు అమ్మ ఎలకనడిగి తెస్తాననేదిలే; అలాగే తెచ్చావు, నువ్వుకూడా!''

''కథవినండి.''

''చిన్నముక్కేనా నువ్వుతిన్నావుకావేమిటి? ఈ ముక్క నాకుచాల్లే. నువ్వుకూడా పుచ్చుకోమరి; నోరుపట్టు; ఆఁ; యిక కథచెప్పు.''

''ఎంతవరకు చెప్పాను? ఆఁ. అప్పుడాయతీశ్వ రుడు చాలాసంతోషించి, ఆశీర్వదిస్తూ, అమ్మాయికి మంచి పెనిమిటి దొరుకుతాడనిచెప్పి వెళ్ళిపోయా డుట. అవ్వ సంతోషిస్తూ, పిల్లకి మంచిభర్త లభిస్తాడు కదా అని నిర్విచారంగా వుండేది.''

"నీవేళ్లెంత మెత్తగావున్నాయి! ఏం, చక్కిలి గిలిగా ఉందా?"

"ఊఁ. వినండిమరి. ఇలా కొన్నిరోజులయిం తరువాత, ఒక బ్రాహ్మణకుఱ్ఱవాడు కాశీలో విద్య పూర్తిచేసి తిరిగి యింటికివస్తూ, త్రోవలో ఈ అవ్వ యింటికి అతిథిగా భోజనానికి వచ్చాడుట. అతనుచాలా అందమైనవాడూ, అన్ని శాస్త్రాలూ చదువుకున్నవాడూ, మంచివాడూనుట."

"నువ్వువేసుకున్న బాడీసు పట్టులా మెరుస్తూంది."

"ఊఁ. ఆఅబ్బాయి, అమ్మాయినిచూసి చాలా యిష్టపడి, అవ్వని అడిగాడుట. అవ్వ సంతోషించి 'ఏమే పిల్లా, పెళ్లి చేసుకుంటావా?' అని అడిగింది. 'అలాగే' అందిటాపిల్ల. అప్పుడు మంచిముహూర్తాన్ని వాళ్ళిద్దరికీ వివాహమయింది. ఆ అమ్మాయి ఓ జాజి తీగ పందిరవేసి పెంచింది. పెళ్ళినాటికి ఆపందిరని జాజి పువ్వులు విరియపూశాయిట."

"నీకు చిన్నపిల్లల్ని ముద్దులాడటం బాగా వచ్చునేం? ఏదీ, మాఅన్నయ్యపాపని ఎలా ముద్దులాడతావు?"

"ఏమిటండీ, కథవినకుండా!"

"ఒకసారి చెబుదూ."

"మీరే చెప్పండి."

"దా మరి. అంతదూరంగా జరుగుతావెందుకు?"

"సరిపోయింది! చాల్లెండి; కథ చెప్పనివ్వండి. కొన్నాళ్ళకి ఆ అమ్మాయి కడుపుతో ఉందిట; అంచేత పుట్టింటికొచ్చింది."

"నీకు పుట్టింటిలో బాగుంటుందా, యిక్కడ బాగుంటుందా?"

"ఎక్కడున్నా బాగానే ఉంటుంది. ఇవాళ మరి కథ చెప్పనిచ్చేటట్టు లేదు."

"నిజంగా చెప్పు. మీయింట్లో అయితే నీ కే పనీ, బెడదా ఉండవు. మీ వదినె అన్నీ కనుక్కుంటుంది; మీ అమ్మ అన్నీ వండి పెడుతుంది; ఏం? ఇక్కడైతే ఏముంది?"

"మీరు మాత్రం సరదాగా లేరూ? కను క్కోవడం లేదా? ఇక్కడున్న పనిమాత్రం ఏమిటి? కథకానీండి మరి. అవ్వ, మనుమరాలు కానుపుకు వచ్చింది కదా అని సంతోషంతో అన్నీ వండిపెట్టేదిట. నవమాసాలూ పూర్తి అయినాక అమ్మాయికి మంచి నక్షత్రాన్ని రత్నంలాంటికొడుకుపుట్టాడు."

"నీకు మగబిడ్డపుడితే యిష్టమా, ఆడపిల్లయితే యిష్టమా?"

"ఇవాళ కథ ఏలాగూ కాదు. నిద్రపోండి; కాళ్ళుపడతాను."

"ఒద్దొద్దు. ఇంతసేపూకూచున్నావు. నువ్వూ కాస్త విశ్రమించు. ఆఁ, ఎంతబాగున్నావు సీతా! నావీపు మీద ఏవేనా అక్షరాలు రాయి, పోల్చేసు కుంటాను."

"అలాగే...ఏమిటి చెప్పుకోండి."

"సీతారాములు."

"అవును...ఇప్పుడేమిటి రాశానో చెప్పండి."

"పార్వతీ పరమేశ్వరులు."

"సరిగా చెప్పేశారండి."

"ఇక నీవీపుమీద రాస్తాను పోల్చుకుంటావా?"

"అలాగే, కాని కతకితలు మాత్రం పెట్టకండి."

"సరే...ఏమిటి చెప్పుకో."

"రాధాకృష్ణులు."

"ఆఁ...యిప్పుడు చెప్పూ."

"ఎంత పెంకివారండీ!"

"ఏమిటో చెప్పు చూద్దాం."

"మీపేరే రాశారు."

"ఆఁ. అవునుకాని, యిలా జోరుగా వాన కురుస్తూ, రొజ్జగాలివీస్తూ, చలివేస్తూంటే నీ కిష్టమా. వెన్నెలొస్తే యిష్టమా?"

"వెన్నెట్లోనే."

"వెన్నెట్లో హాయిగా వుంటుంది, కాని జోరుగా వానకురుస్తూ, చలివేస్తూంటే, మనిద్దరం యిలావుంటే బాగుండదూ? నాకు వర్షాకాలం, నువ్వు నాదగ్గిరిలా వుంటే యిష్టం. నవ్వుతున్నావా? చిన్నప్పుడు నేను పెళ్ళిచేసుకోననే వాడిని. నిజంగా మానేసుంటే నిన్ను పరికో యిచ్చి పెళ్ళిచేసేస్తురు, ఏం? అప్పుడు నా కేమయేది?"

"నేను పెళ్ళిచేసుకోకుండానే వుండేదాన్ని."

"నిజంగానే?"

"నిజంగానే."

"నీకు పాపపుట్టాక నాతో యింత చనువుగా వుంటావా? నన్ను మరిచిపోవు కదా!"

"ఏమిటండీ, అల్లా అంటారు!"

"జ్ఞాపకం వుందీ, మొదట్లో... నవ్వుతున్నా! అబ్బా, అప్పుడు నీకెంతసిగ్గు!"

"ఇందాక ఏమిటి రాస్తున్నారో చెప్పరూ?"

"చెప్తే నవ్వుతావు."

"నవ్వను, చెప్పండి."

"నీగురించే రాస్తున్నాను. నువ్వెంత మంచి దానివో, నువ్వొచ్చిందగ్గరనుంచీ ఎంతసరదాగా గడు

స్తూందో, ఏవిషయంమీద నాకెంత ఆసక్తి పెరిగిందో, అంతా కథలాగు రాస్తున్నాను."

"ఎందుకంటే అలారాస్తారు, నేను మాత్రం అందరు ఆడవాళ్ళలాంటిదాన్ని కానూ? మీరుమాత్రం ఎంత మంచివారు కారు?"

"కాదు సీతా, నువ్వు నాకన్నివిధాలా ఎంతో సంతోషం చేస్తావు. తిరిగి నేనేం చేసినా, ఎప్పుడూ నీకు ఋణపడిన స్త్రీ వుంటుంది. అచ్చంగా నువ్వు, రామాయణంలో జనకమహారాజు కుమార్తె, సీతవంటి దానవు."

"ఆలాగనకండి, సీతామహాదేవితో సామ్యమేమిటి? తప్పుకాదూ? మీ మాటలువింటే నాకు సిగ్గువేస్తుంది."

"సిగ్గెందుకూ? నువ్వు నవ్వితే నీ బుగ్గలెంత చక్కగా సొట్టలుపడతాయనుకున్నావు! నీ కాటిక కళ్ళు మెరుస్తూ నవ్వుతున్నట్టు వుంటాయి, మీఅమ్మ దగ్గర నీకు చాలా చనువనుకుంటానేం?"

"ఎవరమ్మదగ్గిర వాళ్ళకి చనువుకాదూమరీ?"

"చిన్నప్పటినుంచీ మనిద్దరం కలిసివుంటే ఎంత బాగుండును! మనకింకా వేగం పెళ్ళైవుంటేబాగుండేది."

"ఇప్పుడుమాత్రం ఏమయింది" అని, సీత నవ్వుతూ, నాజుట్టు అప్యాయంతో నిమిరింది.

"ఒచ్చేజన్మంలో నువ్వూ నేనూ చనువుగా ఒక్క చోటే పెరుగుదాం. అలాగేనా?"

"ఇప్పుడుమాత్రం చనువుగా లేమూ? ఇంతగా మాట్లాడతారు! ఎంతో అదృష్టవంతురాలిని అనుకుంటాను."

"మనిద్దరం అదృష్టవంతులమే; కాని నీకంటే నేను చాలా అదృష్టవంతుణ్ణి. నీ నేర్పరితనానికీ, ఆదరానికీ, లాలిత్యానికీ నే నేమీ తగననిపిస్తుంది. అయితే, పరమేశ్వరుడు మనిద్దరినీ ఒకరికోసంఒకరుయిలా కలుసుకోడానికే సృష్టించాడు; ఏం?"...

"నిన్నరాత్రి మీరు నన్ను కోపబడినట్టుకల వచ్చింది."

"నిజంగానే! అప్పుడేమిటిచేశావు?"

"కళ్ళంట నీళ్ళు వచ్చాయిట."

"నామీద చాలా కోపంవచ్చిందేమిటి?"

"అట్టే రాలేదులెండి."

"ఇవాళ మళ్ళీ కలవస్తే నేవొస్తున్నే చెప్పు సుమీ! మొన్నరాత్రి దొంగకలవచ్చి నాకు భయం వేసింది. నీదగ్గరగా జరిగి హత్తుకున్నాను. తరువాత తెలివివచ్చింది."

"ఆఁ హాఁ!"

"శాలువ నాకుకూడా కప్పు."

"ఊఁ."...

ఇప్పు డెంత వేళవుతుంది చెప్మా? అబ్బా, యింకా వానకురుస్తూనేఉంది. లేచి లాంతరు హెచ్చించి బల్లమీద పెట్టాను. రెండున్నరయింది. సీత గుండెల మీద చెయ్యి వేసుకుని నిబ్బరంగా పడుకుంది. బల్ల దగ్గరనుంచే సీత వేపు చూశాను. ఆశ్చర్యం వేస్తుంది. ఏ అవస్థలో ఉన్నా, కొత్తగా శృంగారించుకున్నట్టే ఉంటుంది. ఏమైనా రాట్నామూ అనుకున్నాను; కాని లాంతరుతగ్గించి మళ్ళీ బీరువామూల పెట్టేశాను. నిద్ర రాకుండా ఉంది. భయంవేసేకల వస్తుందేమోనని గుండెల మీదనుంచి సీత చెయ్యి తీసేశాను. జుట్టునుదురుమీద కొంచెం చెదిరివుంటే పాపిడిలోసరిదీశాను. సీత మెళకువ వచ్చి లేస్తుందేమో అనుకున్నాను, కాని గాఢనిద్ర. ఇటునుంచి అటుదొర్లి ఏదో గొణుక్కుంటూ మళ్లీ పడు కుంది. కాపురంచేస్తూన్న రెండుమూడు సంవత్సరాలూ జ్ఞాపకం వచ్చాయి. మొదట్లో రోజంతా సీతతోనే ఉండాలని ఉండేది. సీతకి చాలాసిగ్గు. మా ఆరాట పడేవాణ్ణి. అది తలుచుకొని యిప్పటికీ సీత నవ్వుకుం టుంది. నవ్వుకోనీ, నాకేమిటి? అందరూ నాలాగే అయిఉంటారు; యింతకీ తప్పేమిటి? భార్యేకదూ? అయినా, సబబ్బూ, సందర్భం లేకుండా సీత అలానవ్వడం ఏమిటి? నేనేం ఉడుక్కోవడం లేదు! ఆడవాళ్లేనేమిటి

మహా, . . . మాకు మాత్రం సిగ్గులేదేమిటి? ఎంతకాలం
ఈసిగ్గనికాని. అదికాకుండా ఆడవాళ్ళకంత సిగ్గేమిటి. . .
వేషం కాకపోతే? కొత్తలో ఓరోజు అర్థరాత్రి మెళ
కువవచ్చి సీతని హత్తుకొన్నాను కాబోలు. మసక
నిద్రలో అటుతిరిగి పడుకొంది. మర్నాడు పొద్దున్న
సీతెందుకో నవ్వింది. నాకు మాచెడ్డ కోపంవచ్చింది.
అవును; నాజూకుతనం నాకు చాతకాదు. నాజూకుతనం
యింకా ఎలాగుండాలేమిటి? నేనేం సీతని కొడు
తున్నానా, తిడుతున్నానా? పల్లెత్తుమాటని ఎరగను.
ఏదో, ఎప్పుడో పెంకిమాటాడానేమో. ఓ రోజు
రాత్రి భోజనం అయ్యాక యిద్దరం యిక్కడే కూర్చు
న్నాం.''

''ఏం, సీతా, బాల్యవితంతువులికి వివాహా
లవుతున్నాయి, బాగానే వుంది, కాని, ఒకరిద్దరు
పిల్లలు పుట్టాక మాత్రం, పిన్నవయసులోనే దురదృష్ట
వశాత్తు వితంతువులయి, మరేదిక్కూ లేనప్పుడు, ఏం
చెయ్యాలి? పిల్లల్ని పోషించడానికీ, సంసారభారం
పంచుకోడానికీ స్త్రీకో పురుషదిక్కు లేకపోతే ఎంత
యిబ్బంది, ఏం?'' అని, మామూలు సాధకబాధకాలే,
కాస్త మాట్లాడబోయేసరికి, ''ఎందుకండీ ఈ అనవస
రపు మాటలూ, అమంగళపు మాటలూను'' అని
విసుక్కుంది. నేను నవ్వడంచూచి, కోపంతో, మాట్లాడ

కుండా అటుతిరిగి పడుకుంది. కొసకి, నేనే చెంపలేసు కొని, యిలాంటిమాట లాడనని చెప్పి బ్రతిమాలుకుంటే కాని, నాతో తిరిగి చనువుగా మాట్లాడిందికాదు. పోనీ, అప్రస్తుతప్రసంగమే అయినా, ఎప్పుడో, ఏదో అన్నా నని నేను వట్టి మోటు వాడినా? ఒస్సీ, ఆడవాళ్లే నేమిటి మహా సున్నితమైనవాళ్లు! మగవాళ్లలో, సున్నిత మైనవాళ్ళూ, అందమైనవాళ్ళూ లేరేం? ఏం, సీతకంటే బాగున్నవాళ్ళు లేరూ?

ఒకసారి సీతవేపు వొంగి దగ్గరనుంచిచూశాను. సీత గొణుక్కుంటూ, అటూ, యిటూ పొర్లి కళ్లు తెరి చింది. తెరిచి, నన్నుచూసి నవ్వింది.

"ఏం, నీకంటే అందమైనవాళ్లు లేరనుకున్నా వేమిటి?"

"అర్ధరాత్రివేళ ఈప్రశ్నేమిటి? లేరని ఎవ రన్నారు?"

"ఆమాటకొస్తే, ఆడవాళ్ళకంటే మగవాళ్లే బాగుంటారు."

"బాగుంటారు; కాని, ఆసంగతి యిప్పుడెం దుకూ?"

"కాదు, సీతా; నామటుకూ నీకంటే ఎవరూ బాగుండరు."

"బాగానే వుంది! నిద్రపట్టనట్టుంది. రాత్రంతా అర్థం పర్థం లేని ఆలోచనలు చేస్తున్నావేమిటి?"

"అదేం కాదు; నే నింతయిదిగా ఉంటూంటాను కదా, నువ్వేమిటా నాకోసం ఉబలాటపడ వెందుకని ఆశ్చర్యపడుతున్నాను... అన్నిటికీ నవ్వడం ఒకటి వచ్చును! నీకోసం ఎవరూ బెంగ పెట్టుకోరు లే!"

"ఇదిగో, చూడండి; ఉబలాటపడటమంటే నన్నేమి చెయ్యమన్నావేమిటి?"

నాలో నాకే నవ్వొచ్చింది. ఉబలాటపడట మేమిటి! చాలా సిగ్గువేసింది కూడాను. సీతే కదా నన్నన్ని విధాలా కనుక్కుంటూ, అన్నీ వండి పెడుతూ, ఏలోపమూ లేకుండా యింతబాగా చూస్తూంది. ఇంత ఆప్యాయంగా వుంటూంటే సీతమీద నాకు కోపమేమిటి!

"ఉట్టినే విసుక్కున్నాను సుమా; ఏమీ అనుకో కేం?"

"అబ్బే, లేదండీ."

"చిన్నప్పుడు నేను చాలా పెంకెవాణ్ణి. నువ్వుండబట్టి కాని, లేకపోతే ఎందుకూ పనికిమాలినవాడినై పోదును. నేనోసంగతి చెబుతాను; ఏమీ అనుకోవు కదా?"

"ఏమీ అనుకోను."

"చిన్నప్పుడు, దొరసానిని పెళ్ళిచేసుకోవడ

మంటే చాలాగొప్ప అనుకునేవాడిని...అదిగో, మరి నవ్వుతున్నావు!''

''నవ్వను, నవ్వను; చెప్పండి.''

''ఏంగా లేదు; చిన్నప్పుడే నుకలా అనుకునే వాడినో; కాని, నీ కివాళెవరి దగ్గరనుంచి ఉత్తరం వచ్చింది?''

''అక్కయ్య దగ్గరనుంచి.''

''ఏమంటుంది?''

''ఏమీ లేదు; తనూ, పిల్లలూ, అంతా క్షేమంగా ఉన్నారుట. అమ్మని చూడాలని వచ్చిందిట. మనని కూడా చాలా చూడాలని వుందిట.''

''రమ్మని రాయకూడదూ?''

''ఎవరేనా రాయుంవద్దూ?''

''మీ తమ్ముడిని రాయుంతీసుకు రమ్మను.''

''ఆఁ, మీరు రాకూడదూ? ఒక్కసారీ రారు కానీ; కాసకి దిగబెట్టడానికి కూడా రారు! నేను రాయను రమ్మని; యీమారు మీరు రావాలక్కడికి.''

''అక్కడ నాకేమి తోస్తుంది? నువ్వెళ్లి మీ అమ్మతో కూచుంటావు.''

''అన్నయ్య, వదిన, అక్కయ్య, తమ్ముడూ, అంతా లేరేమిటి?''

''వాళ్లనే యిక్కడికి రమ్మనకూడదూ?''

"బాగుందండీ! మీరు యిల్లు కదలరు; అందరూ మీయింటికే రావాలి? చాల్లెం? మళ్ళీ సెలవులై పోతాయి. ఇప్పుడే వెళదాం; ఏం? ఏన్నాళ్ళో నే వెళ్ళి ఉండను; మీకు యిబ్బందవుతుందని ఉండిపోయాను."

"పురిటికి తప్పకుండా దిగబెడతానులే;... అంత నవ్వెందుకూ?"

"అప్పుడెవరికోసం వస్తారుకాని, యిప్పుడోసారి రాకూడదూ?"

"నేను రావడం సరదావా, పుట్టింటికి వెళ్ళడం సరదావా; నిజంగా చెప్పు."

"రెండూను."

"అయితే, వెళదాం అంటావేమిటి?"

"ఊఁ; ఎప్పుడు మరి?"

"వానింకా కురుస్తోంది కాబోలు?"

"తగ్గిపోయిందండి. బయలుదేరేప్పటికి బాగా తెరిపిచ్చేటట్టువుంది."

"అయితే ఆలస్యం ఎందుకు, పెందరాళే బయలుదేరదాం. మీయింట్లో నాలుగురోజులుండి, అక్కడినుంచి అమ్మవాళ్ళని చూడడానికి వెళ్తాను. వచ్చేప్పుడు యిద్దరం కలిసివచ్చేద్దాం. అలాగేనా?

"అలాగే."

"లేక, ఏ వంకో పెట్టి వుండిపోతావా? అది

కాకుండా నేనక్కడ తలంటుకోను; యిప్పుడే చెప్తున్నా; వారం కిందటే తలంటుకున్నా గూడాను.''

''సరే కాని, యిక మీరు తెమలాలి; తెల్లవారేటట్టుంది.''

''కాఫీవో ఏదో యింత పుచ్చుకుని మరీ బయల్దేరుదాం. సామాను సర్దుకోవడం, నాలుగూ చూసుకోవడం, అదీ వుందిగానూ.''

''దాని కేంలెండి; కాఫీ, సర్దడం, అన్నీ నే చూస్తాను కదా.''

''అయితే యిక లేచి ముఖం కడుక్కుందాం; మరేంచేద్దాం?''

''ఊఁ ఊఁ.''

౨

ఇక్కడికొచ్చి రెండురోజులయింది. ఎల్లుండి మా వూరు వెళ్ళాలి. అమ్మని, అక్కయ్యని, పిల్లల్నీ చూచి వారంరోజుల్లోగా మళ్ళీ యిక్కడికి రావాలి. సీతకి పుట్టింట్లో మరో నాలుగురోజులు ఉండాలని ఉంటుంది; నిజమే; ఎలామరి? అక్కయ్య వచ్చింది, అమ్మ అక్కడే ఉండాలిగదా; మరి నాకు వండిపెట్టే వారెవరు? అది కాకపోయినా, ఎవరో ఒకరు లేకపోతే నాకు తోచనేతోచదు.

సీత వాళ్ళిల్లు దేవాలయంపక్కనే ఉంది. కోలనుకూడా దగ్గరే. ఇక్కడ బాగానే కాలక్షేపమవుతూంది. సీత అమ్మ, అమ్మమ్మా అంతా మంచివారూ, శాంతస్వభావులునూ. బావమరిది కూడా సరదాగా వుంటాడు. సీతవదినె బహుపొందికైన మనిషి. ఆమెను చూస్తే మా పినతండ్రిగారి తాలూకు బుచ్చమ్మ జ్ఞాపకం వస్తుంది. ఆశ్చర్యం వేస్తుంది, పోలిక లెలాగొస్తాయో!

నిన్న పొద్దున్నే అందరం ఏటికి స్నానానికి వెళ్లాం. సీతయూ మా వాళ్ళూ, వాళ్ళన్నయ్యతోడి వాళ్లూ, మూడు నాలుగు పొరుగిళ్ళ పరిచయస్థులు కూడా వచ్చారు. నేనాశ్చర్యపోయాను; నాతోనూ, వాళ్లన్నతోనూ సీత సరదాగా యీదింది. ఏట్లో నీరు సామాన్యంగానే ఉంది, మరేం అంత ప్రవాహం లేదు. కాని, వాళ్ళమ్మమ్మకూ భయం. 'ఇన్నాళ్ళొచ్చి కాపురం చేస్తూంటే, యింకా చంటిబిడ్డలాగు ఘంటలకొద్దీ నీళ్లలో నానుతుంది. బొత్తిగా భయంలేదు, వాళ్లతో సరిగ్గా అదీను! మీరుమాత్రం ఎందుకట్టా వూరుకోటం ఏట్లోకి? అంతా ఈపాటేరాండి' అంటూ సీతని, అందర్నీ వాళ్లమ్మమ్మ కూకలేసింది. చాలా సరదాగా వుంది.

సాయంకాలం, సీతతో వాళ్ళమ్మమ్మ 'యిదేమి

చోద్యమే, రోజంతా నీ మొగుడితో ముచ్చటలతోనే సరిపోతూంది; ఆవుకి పాలుపితికి, దీపాలు వెలిగించు' అంటూంది! పాపం, యింటిపనులన్నిట్లో సాయపడుతూ, నాకు తోచదేమో అని ఓసారి నాదగ్గిరకి వచ్చినంత మాత్రాన్ని రోజంతా నాతో ముచ్చటలా! మొన్న ఈవిడే అంది కూడాను: 'సీత వస్తే యిల్లంతా కల కల్లాడుతుంది; అన్ని పనులూ యిట్టే అయిపోతాయి. కొత్తావుకూడా పెంకితనం మానేసి చెంబునిండా పాలి స్తుంది' అని. అమ్మమ్మలంతా ఒకటేమో స్తరు. పగలు కాస్తసేపు ఏ అవసరమో వచ్చి మాట్లాడుకుంటే రోజంతా ముచ్చటలే అంటారు. భార్యని అట్టే పొగడకూడదుకాని సీతలాంటి మనిషే లేదు....

నేనూ సీతతో ఆవులశాలవద్దకు వెళ్ళాను. ఆవు బాగావుంది కాని, దాని యెదురుచూస్తే పొడుస్తుందని నాకు భయం. 'గంగిగోవు; ఎవరినీ పొడవదు' అంటుంది సీత. అవును, సీత దగ్గిర సాధువుగానే వుంటాయి పశువులు. అక్కడినుంచి వచ్చాక దశావ తారాల కీర్తన పాడుతూ దీపాలన్నీ వెలిగించింది. సాయంకాల సంధ్యారాగాల్లో, చల్లగాలి వీస్తూన్నప్పుడు ఆ కీర్తన పాడుతూంటే...

''ఏమిటాలోచిస్తున్నారు?''

"ఏమీలేదు, వస్తున్నావా, మీ అమ్మదగ్గర ఇంకా కబుర్లు చెబుతూ కూచుంటావా?"

"ఏమండీ, తోచడంలేదా ఏమిటి?"

"అవును, ఇంతసేపూ మీ అమ్మావాళ్ళదగ్గర ఉండాలనిఉంటుంది నీకు, కాని నాకేమీ తోచదు."

"తమ్ముడూ యిలాగే సుమండీ, యిన్నేళ్ళొచ్చాయి, యిప్పటికీ కథ చెప్పేవరకూ నిద్రపోడు. వేగమే వస్తానులెండి. అందాకా అన్నయ్యవాళ్లతో పేకాటాడరాదూ, సరదాపడతారు."

"మధ్యాహ్నం పేకాటాడేం కాదూ? రేపు మళ్ళీ ఆడుకోవచ్చు. బావకీ పేకాట మా సరదా లాగుందే?"

"అన్నయ్యా, వదినే పేకాటకి యిద్దరూ ఒకరికొకరు సరి! ఒక్కరోజైనా, నేనేనా వస్తే, ఒక్కక్షణం తీరుబడివుంటే చాలు, పేకాటవేస్తారు, అంతసరదా."

"అలాగా, అవునుకానీ, నాకోసం వేరే మరో కూర చేశావెందుకూ? అందరిలో నాకొక్కడికే అలా వేస్తే బాగుంటుందీ? ...నవ్వుతావేమిటి?"

"పాదుని నాలుగు కాయలుంటే, మీకిష్టమని అమ్మ వేపుడుకూర చెయ్యమంది."

"నాకు చాలా సిగ్గువేసిందిసుమీ. 'మొగుడొచ్చేసరికి నాన్నా, అమ్మా అందర్నీ మరిచిపోతుం'దని

మీ అమ్మమ్మ అందకూడాను...అం తెలా నవ్వుతా వేమిటి?''

''అవునుకాని, యివాళ రాసుకోవాలన్నారు, కాఫీపెట్టేదా?''

''ఇవాళకిక రాసేదేఁవిటి? కబుర్లు చెప్పు కుంటూ పడుకుందాం. తాంబూలం మహా బాగావుంది; యిలా వక్కపొడి చెయ్యడం నేర్చుకోకూడదూ?''

''దాని కేంగాని, ఎల్లుండే వెళతారా?''

''వెళ్ళొద్దూమరి; వారంరోజుల్లోగానే వస్తాను. చీర మార్చుకోవాలా?''

''మార్చుకోనక్కర లేదుకాని, నాన్నకి మందిచ్చి వస్తానిప్పుడే.''...

''మందిచ్చేశావా? కిటికీదగ్గిరగా వేసుకుందాం. ఏం? వెన్నెల హాయిగా పడుతోంది.''

''నిన్న కొంచెం పడిశం పట్టిందని మిరియాల మాత్ర వేసుకున్నారు; యివాళ వెన్నెట్లో పడుకుం టారూ, బాగానేవుంది!''

''పోనీ లేకాని, కూచున్నావేమిటి. కాస్త విశ్ర మించు.''

''ఇవాళ చాలాదూరం షికారుగా తిరిగివచ్చి నట్టున్నారు.''

''వద్దు, వద్దు; నాకు కాళ్ళు పీకడంలేందే...

యింకా నీకు మొహమాటం పోలేదుకదా; అయినా, యిప్పు డెవరేనా చూస్తారుగనకనా? ... అదిగో, ఏమేనా చెప్తే నవ్వుతావు...దమానం ఎక్కడిది? మా మిరుచివాసన వేస్తోంది.''

''నేస్తం యిచ్చింది.''

''నేస్తం ఎవరు?''

''దీక్షితులుగారి కూతురే.''

''నేస్తం అంటున్నావేం; పేరుపెట్టి పిలవవా ఏంవిటి?''

''పిలవకేమీ; ఆమె పేరు లలిత; చిట్టెమ్మ అనే అంతా పిలుస్తారులెండి. చిన్నప్పటినుంచీ మా యిద్దరికీ చాలా స్నేహం. అంచేత నేస్తంఅనే అలవాటు.''

''కాపురం చేస్తోందా?''

''ఆఁ. ఒక పిల్లాడుకూడానూ. వాళ్లక్కయ్య కొడుక్కి బాలసారెకు వచ్చింది. మరో నాలుగు రోజు లుండి వెళ్ళిపోతుందట. రేపు మనిద్దరినీ ఫలహారానికి పిల్చింది; తన పుట్టినరోజుట.''

''నేనెందుకూ, మాటవరసకి పిలిచిందేమో; వెళ్తే బాగుంటుందా?''

''మాటవరస కేమిటి; ఎందుకు బాగుండదూ? పరాయివాళ్లా ఏమిటి? సాయంకాలం మీరు లేరు;

లేకపోతే యిూతోసూ చెప్పవుగును నేస్తం పెనిమిటి యిక్కడికి వస్తే, యిద్దరూ యిక్కడొకపూట భోజనం చెయ్యకుండా వెళ్ళరు.''

''నల్లపువ్వుల చీరెకట్టుకుని నిన్న వచ్చింది; ఆమేనా నేస్తం అంటే?''

''ఆఁ. ఆ అమ్మాయే.''

''బాగుంటుందే.''

''చాలా అందంగా వుంటుంది; మంచి కళైన ముఖం.''

''ఇందాక పెరుగు తీసుకొచ్చినామె ఎవరు?''

''సుందరమ్మ, చౌదరిగారమ్మాయి.''

''నెమ్మదైన అమ్మాయిలాగుంది; పెరుగెందుకు తీసుకు వచ్చింది?''

''చిన్నప్పటినుంచీ ఎరుగును. వాళ్ళ గేదె యీనింది కాంసు. పాడీ, పంటా సమృద్ధిగా కలవాళ్ళు. బంధువులొచ్చినా, కార్యమొచ్చినా, తెలిసున్న యిరుగుపొరుగువారికి అభిమానంతో పంపిస్తూంటారు.''

''ఊఁ. మరి నీ నేస్తం సంగతేమిటి?''

''చాలా మంచిదన్నీ, మనం అంటే అతిఆపేక్షా, అభిమానమున్నూ. మాయిద్దరికీ యింతా, అంతా స్నేహంకాదు; ఒకరికొకరు ప్రాణమన్నమాట.''

''అవును, ఆడవాళ్ళ కే[illegible]నా వుపద్రవమే, కాని, అంతస్నేహవేం?''

''చెప్పొద్దు కాదూ? ప్రతిది, నాసంగతి ఆమెకు చెప్పేస్తాను. ఏసంగతీ దాచనండీ, నేస్తం నాదగ్గిర దాచదు.''

''అలాగేం? నాకు తెలియని రహస్యాలుకూడా నేస్తంకి చెప్పేస్తావు కాబోలు. ఎవ్వరితో చెప్పుకుంటూ? అన్ని సంగతులూ మరి సుతీరా మాట్లాడుకున్నారా? ఇక్కడికి వచ్చాక మీరిద్దరూ ఒక్క ఘడియైనా విడివుండలేకపోరా.''

''ఏమైనాసరే. రెండురోజులక్కడ వుంటేనే కాని ఒప్పుకోనుట.''

''ఒప్పుకోవడమేమిటి, అక్కడ వుండిపోవడం నీకు సరిదా అని చెప్పు. వాతో వున్నదేయిది. చిన్నప్పటిస్నేహితులొచ్చేసరికి మామాట మరిచిపోతారు. నువ్వెళ్ళి అక్కడుంటే, నేనెందుకూ యిక్కడుండడం?''

''అంత కోపమెందుకండీ, నేను రేపు వెళ్తాననందే? అయితే మీరుమాత్రం ఆమధ్య ఎవరో స్నేహితుడొచ్చాడని రాత్రీ, పగలూ, భోజనం చెయ్యడం, అన్నిసంగతులూ మరిచిపోయి, యిరవై నాలుగు ఘంటలూ అతనితోనే కూర్చోలేదూ?''

''అమ్మమ్మా! అలాంటమనిషి వున్నాడా! చాలా యోగ్యుడుసుమీ!''

"కాదని ఎవరన్నారు? ఇల్లూ, వాకిలీ, అన్నీ మరిచిపోయారే! నేస్తం నన్ను పిలిచిందంటే అంత చిరాకుపడతారేం? ఇంతకీ మీరిక్కడ వుండగా ఏమన్నాలేకపోదా, నేను వెళ్ళానా?"

"అబ్బే, విసుక్కోలేదు; నీనేస్తులు నాకుమాత్రం ప్రియమైనవారుకారూ? నువ్వు లేకపోతే తోచదని అన్నాను. అయినా, చిరాకుపడివుంటే నాదేతప్పు. ఏమీ అనుకోకేం?"

"అబ్బే, లేదండీ."

"ఎవరింటికో వెడతామన్నారు, వెళ్లారా?"

"లేదండీ. ఏరోజు కారోజే అయిపోతూంది. రేపు తప్పకుండా వెళ్ళాలి."

"ఎవరేమిటి వాళ్ళు?"

"మనవాళ్ళే. పక్క గ్రామమేను వాళ్లది; దగ్గరే."

"బంధువులేనా, నేనూ వస్తాను. అయితే పూరికినే వెడుతున్నారా, ఏమేనా విశేషముందా?"

"చాలా రోజులయింది, ఓమారు చూదామనీ. వాళ్లమ్మాయి పుట్టింటికి వచ్చిందిట. మీరూరండీ; అంతా కలిసే వెడదాం."

"అయితే నేనెందుకు కాని...వాళ్ళింట్లో కుఱ్ఱాళ్ళవరేనా వున్నారా?"

''పన్నెండు, పధ్నాలుగేళ్ళ అబ్బాయివున్నాడు; అమ్మాయి, అమ్మ, నాన్న వున్నారు. రెండో అబ్బాయి విశాఖపట్నంలో డాక్టరీ చదువుతున్నాడు; పెద్దతనికి కాకినాడలో వుద్యోగం.''

''ఓహో, ఈ కాకినాడతనికే నేమిటి, నీకు మొదట సంబంధం తలపెట్టారని చెప్పావు?''

''ఇతనికే;...ఎంతజ్ఞాపకం వుందండి!''

''అంత సిగ్గెందుకూ? ఊఁ, అయితే యితని సంగతి కొంచెం చెబుదూ.''

''సంగతి చెప్పటానికేముంది?''

''మంచివాడేనా, పెళ్లయిందా?''

''మంచి ఆతనే; కాపురం చేస్తున్నాడు.''

''ఇంకేమి సంబంధాలొచ్చాయి, నీ పెళ్ళికి?''

''నాకేం తెలుస్తుందండీ; అయినా మీకుమాత్రం సంబంధాలు రాకుండావుండేనా ఏమిటి?''

''ఏ సంబంధాలొచ్చినా, నిన్నుతప్ప యింకెవరి నేనా పెళ్లిచేసుకుందు ననుకున్నావా ఏమిటి?...ఓహో, నీకొచ్చిన సంబంధాలు నా సంబంధంకంటే చాలా మంచివీ, గొప్పవీఅనా నవ్వుతున్నావు?''

''ఎందుకండీ అలాఅంటారు; మీ సంబంధం కంటే మంచిదుంటుందా ఏమిటి?''

''ఏ కాకినాడదో, ఏలూరుదో, గొప్పసంబంధ

మవుతే హాయిగా వుండువా? నాదగ్గిరేముంది, నౌకర్లా, చాకర్లా, ఎంతసేపూ చాకిరీ వేకదా, ఏం?''

''నేనెంతో అదృష్టవంతురాలి ననుకుంటూంటే, కష్టపడుతున్నానంటా రెందుకండీ?''

''నువ్వా, నేనా అదృష్టవంతులిమి? నిన్నెవరు పెళ్ళిచేసుకున్నా అదృష్టవంతులే అవుదురు. ఏమున్నా లేకపోయినా, నువ్వొకర్తె వున్నావుగనుక నాకన్నిటికీ సరిపోతూంది, కాని నీకేమిటి, నన్ను కాకపోతే నాకంటే ఉత్తముడు మరొకరిని వివాహమాడి నిత్యేపంగా వుండువు.''

''ఇప్పుడుమాత్రం నిత్యేపంగా లేనూ? కాపురం చేస్తున్నవాళ్ళందరూ ఈమాత్రం యింటిపనులు చెయ్యరుటండీ, నాకేమిటి తక్కువచేస్తున్నారు? నాకంటే ఉత్తమురాళ్ళు మీకుమాత్రం దొరకక పోయారా? ఎందుకూ, వూరికే అనుకోవడం?''

''నువ్వు మంచిదానివి గనుక ఏ యిబ్బందీ కష్టం వున్నా విసుక్కోవు, అంతా నీలాంటివాళ్ళే అనుకున్నావేమిటి?''

''అయినా మీరు మరీన్నీ, చిన్నవాళ్లను పొగడడమేమిటి? సిగ్గుకాడూను!''

''ఏమని పొగిడాను? ఉన్నసంగతే కాదూ చెప్పాను?''

"సాయంత్రం కూరలు తరుగుతున్నప్పుడు 'ఏలుకోడమేకాని, మాచిన్నతనాల్లో యిలాంటి సోద్యం ఎరగం' అని అనుకుంటూంటే ఎంతసిగ్గు వేసిందని!"

"అలా అన్నారేం; ఎవరన్నారు?"

"ఒకరేమిటి, సూరమ్మగారూ వాళ్లూ వచ్చినప్పుడు అందరూ అనుకున్నారు. అంతసేపూ మీ మీద ప్రసంగమే."

"ఏమిటా ప్రసంగం? అంతా చెబుదూ; యింకా ఎవరెవరున్నా రప్పుడు?"

"అమ్మమ్మా, అంతా వున్నారు; ఏంఅంటారు? 'అదృష్టవంతురాలు, అమ్మాయికప్పెనిమిటి పోరికాడు; గడుసుపిల్ల, బాగా ఆడిస్తూంట; యింకా నయం, శర్మగారి అల్లుడులాగ పెళ్ళాన్నే మీరని పిలవడంలేదు!' యిలాగే, అంతిసేపుసున్న."

"నేను వట్టి అమాయకుణ్ణా? ఏదీ రేపు మీ అమ్మమ్మనే అడుగుతాను. కాని, శర్మగారల్లుడు భార్యని మీ రంటాడేం? పొగడనులేకాని, నేను అందు వేసిన బాడీసు తొడుక్కున్నావా? ఎలాగుంట; సరిపోయిందా?"

"రాత్రి వేసుకోడానికి బాగానేవుంది."

"రాత్రేమిటి, పగలు వేసుకోడానికిమాత్రం బాగులేదూ? ఒగ్గులులేకుండానే కుట్టానే."

''కొంచెం బిగువయింది. విప్పి మళ్లీ కుట్టు కున్నాను. అయినా మీకెందుకు చెప్పండీ, ఎవరేనా వింటే నవ్వుకోడానికి!''

''నాకెందుకేమిటి? నాలుగుపనులూ కొంచెం వస్తే మంచిదే కదూ. బిగువైపోయిందేం; చెప్పావు కాదేం? ఈమారు బాగా కుట్టాను, చూద్దువుకాని.''

''ఎందుకండీ, అరగంటపని నాలుగుగంటలు చెయ్యడం; ఎవరిపనులు వారు చేసుకోక మగవారి కెందుకూ? యింతకీ నేనున్నానుకానూ అవసరం వచ్చి నప్పుడు, మీవీ నావీకూడా, చిన్నచిన్న కుట్టుపనులు చెయ్యడానికి?''

''కొత్తలో ఆలస్యం అవుతే అవుతుంది. నీ కూరికినే శ్రమఎందుకూ; యింట్లోపని చాలకనా, నీవీ, నావీ కూడా కుడతానంటావు. నాకు తీరుబడి ఉన్న ప్పుడు నేనెందుకు కుట్టకూడదూ? కుట్టుపని మగవాళ్లు చేయరా ఏమిటి? కుట్టుపనివాళ్లు వాళ్ళింటిబట్టలు కుట్టరా?''

''కుట్టుపనివాళ్లు దుస్తులూకుడ్తారు; వంటపని వాళ్ళూ, హోటేలువాళ్ళూ వంటచేసిపెడతారు; డాక్టరు అవసరంవస్తే యింట్లోవారికి సేవాచేస్తారు. అది వాళ్ళ పని! నాకు శ్రమేమిటండీ; రాత్రంతా కూచునిరాస్తారూ, మీకుమాత్రం శ్రమకాదేమిటి? అయినా, నే కుట్టే

గెంత; ఎప్పుడో తీరికవున్నప్పుడు కాస్త సరదాకి కుట్టుకోవడం తప్ప. నేస్తాన్నిచూస్తే ఆశ్చర్యపడతారు; ఆమెవీ, భర్తవీ, వాళ్ళమ్మవీ, చిన్నతమ్ముడివీ బట్ట కత్తిరింపుకూడా చేసి కుట్టేస్తుంది. మళ్ళీ ఎప్పుడూ కుట్టినట్టే కనబడదు!''

''బాగా పనిపాట లొచ్చినావిడ లాగుందే!''

''మంచినేర్పరి; యిప్పుడు లేదుకాని, యిదివరకు తనబట్టల్లో సగం స్వయంగా నూలువడికి నేయించుకున్నవే. ఉత్తరాదిని వున్నారు కాదూ, కాశీ, కలకత్తా. అటువేపు వంటలూ, మిఠాయిలూ చెయ్యడం ఎంతబాగా చేతనౌననుకున్నారు! పాటకూడా చక్కగా పాడుతుంది. రేపు విందురుగాని.''

''ఆమెభర్త మంచిఅతనేనా?''

''చాలా మంచిఅతను. అత్తగారు కొంచెం పూర్వాచారంకలదిన్నీ, చాదస్తురాలూ, కాని మొత్తానికి మంచి అనుకూలమైన సంబంధమే; యిద్దరూ చాలా అన్యోన్యంగా ఉంటారు.''

''మీ నేస్తం నీకురాసిన ఉత్తరం ఒకటేనా నాకు చూపించావా మరి?''

''నేను చూడవద్దన్నానా?''

''ఊరకినే అన్నాను, ఎలా రాసుకుంటారో

చూద్దాం అని. కాని అంత తెలివితక్కువవాడి నను కున్నావా ఏమిటి, ఒకరి ఉత్తరాలు చూడడానికి?''

''బాగుందండీ? అన్నీ మీరే అంటారు. ఉత్తరం వస్తే సంగతులు చెప్పమంటారు; నేను చెప్పడం లేదూ? మీ ఉత్తరాలు మాటుకూ మహాచదువుతున్నారు గనుకనా; ఎప్పుడూ నన్నే చదివి సంగతులు చెప్ప మంటారు.''

''అవును కాని నేను మొదట్లో రాసిన ఉత్తరాలు నాకిచ్చేద్దూ; చాల అవకతవకగా రాశాను.''

''నా దగ్గిరే ఉండనియ్యండి; మీకెందుకూ?''

''ఫూ నవ్వాస్; నా ఉత్తరాలు నాకెందుకని అడుగుతావేమిటి? అవెవరికంటపడినా, వాటిలోని సంగతులు తెలిసినా, నా మర్యాద దక్కదు. కాక పోయినా నువ్వుమాత్రం ఏంచేసుకుంటావు? నామాట విని నా కిచ్చేయి.''

''ఒకరికంట ఎందుకు పడతాయీ? మళ్ళీ తీసు కుందామనే నాకురాశారేమిటి? అయినా పెట్టెలో ఏమూలోపడి ఉంటాయి; ఉండనివ్వండి.''

''అదిగో; యిస్తే యిచ్చేయి, లేకపోతే మానే కాని, అలా నవ్వకు. కొత్తలో, తెలిసో తెలియకో రాశాను. ఈమధ్యరాసినవి కావలిస్తే నీ యిష్టం వచ్చినవాళ్ళదగ్గిర చదువు; కాని, ఆ పాతవేపట్టుకు

ఆడిస్తావేం? ఆ ఉత్తరాలన్నీ దండగుచ్చుకుని మెడలో వేసుకో! మీ చేస్తంకీ, ఫూరందరికీ వినిపించు! అడుగు తున్నకొద్దీ ముంపిస్తున్నావు.''

''ఎందుకండీ అంతకోపం; నేనసలా ఉత్తరాల మాట ఎత్తానా? మిమ్మల్నాడించడానికి నేనెంత దాన్ని? మీరు ఆదరణతో రాశారుకదా అని నాదగ్గరే ఉంచనీయమన్నాను. మీకంత కోపాలంటే వద్దంటానా? ఇదిగో ఇటుచూడండి; ఇంకా కోపం ఎందుకు?''

''కోపానికి కాదు. కర్మంచాలక, ఆ వుత్తరాల్లో సంగతులు సూనేస్తం కేనా, ఎవరికేనా తెలుస్తా యనుకో, ఏమనుకుంటారు; మర్యాదగా వుంటుందా? అయినా, నేనిప్పుడు మునపటంత చాదస్తంగా వున్నానా?''

''చాదస్తాని కందులో ఏముందండీ; నేస్తంక మాత్రం ఆమె పెనిమిటి అలా రాయడా ఏమిటి?''

''నిజంగానే! అలాగే రాస్తాడేం! చెప్పాను కాదూ, అంతా ఒక్కలాగే రాస్తారు. నేనొక్కడినే అంత సిగ్గుమాలినవాడి ననుకున్నావా ఏమిటి? అది కాకుండా ఎప్పుడో ఏదో రాశానని యిప్పటికీ అలాంటి వాడినేనా?''

''సిగ్గుమాలినతనానికి వుత్తరాల్లో ఏముంది?

ఊరికినే అన్నీ అనుకుంటారు; యింతకీ నేనేం అనందే విసుక్కుంటారేం ?''

''పైకనకపోతే సరా; ఒక్కలాగ యిందాకటి నుంచీ నవ్వుకుంటున్నావు.''

''మీమాటలు వింటే నాకేకాదు, ఎవరికేనా నవ్వువస్తుంది; ఏం చెయ్యమన్నారు ?''

''అవును కాని, యిందాక మామ్మయ్య నిన్నెందుకూ కోప్పడుతూంది ?''

''ఎప్పుడూ ?''

''సాయంకాలం వత్తులు చేసుకుంటున్నప్పుడు.''

''ఏమీలేదు; అక్కయ్య పిల్లణ్ణి ఏడుస్తూంటే వెంటనే వెళ్ళి వూరడించలేదనీ.''

''నిన్ను కోప్పడడం నే నెప్పుడూ చూడలేదు; నిన్నుకూడా కోప్పడుతారని నేనెప్పుడూ అనుకోలేదు సుమీ.''

''ఇది మరీ బాగుంది! నన్నేమిటి, అమ్మనీ కోప్పడుతుంది. పెద్దవాళ్ళు కోప్పడరూ ? మీరొక్కరు చూస్తున్నారు దేవతలాగ, కాని అమ్మమ్మకేమిటి, మనుమరాలినే కాదూ ?''

''అది కాదు; మామ్మయ్యకి నువ్వెంత మంచి దానవో తెలియదు.''

''ఇందుకే అంటారు మరి ఉట్టి అమాయకులని !

పుట్టినదగ్గరనుంచీ అమమ్మదగ్గిరే పెరిగాను; ఆవిడకి తెలియనిది మీకు బోధపడింది కాంసు నామంచితనం మహాత్తూను."

"ఏమిటీ! నువ్వుకూడా నన్ను అమాయకుడినే అంటున్నావూ! బాగా వుంది; నువ్వేకాబోలు గడుసు దానివి."

"నేనే అమాయకురాల్ని, మీరే గడుసువారు; కాని, చాలారాత్రయింది, పడుకోండి."

"చలి వెయ్యడంలేదూ? నువ్వు నవ్వితే, నాకెవరో జ్ఞాపకం వస్తారు. ఎంతసేపేనా చూడాలనే వుంటుంది. రేపు నువ్వు లేచేటప్పుడు నన్నుకూడా లేపేం. మెళకువ రావడం ఆలస్యం అయిపోతూంది. విసుక్కున్నాసరే లేపే; ఏం?"

"అలాగే."...

3

అప్పుడే అయిదుగంటలు కావచ్చింది; యింకా కథ ముగించలేదు. ఏమైనా యివాళ ముగించేస్తాను. మొదటిభాగం సీతకి చదవడాని కిచ్చాను. సిరాతో వ్రాసిపెడతానంది. అసలు చదవగలదో లేదో, నా దస్తూరి బొత్తిగా బాగుండదు. వరవడి పెట్టడం అదీ అలవాటుంటుంది కదూ, అంచేత ఆడవాళ్ళ వ్రాత

ముత్తానికి బాగుంటుంది. అక్కయ్య వ్రాత ముత్యాలే. ఇప్పుడిది ఎలా ముగించడం? యిలా ఎంతేనా వ్రాయ గలను. దీనికి మరి తెంపే వుండదు....

"చీకాకుగా తిరిగిరారూ, సాయంకాలం కావ చ్చింది. ఇదిగో, కాఫీ తెచ్చాను, వదినె కలిపింది."

"ఎందుకు కలపమన్నావ్? మాటవరస కన్నాను, మధ్యమధ్యని కాఫీలేకపోతే కథ జరగదని; కాని, కథ చదివావా, ఎలాగుంది?...నవ్వుతా వెందుకూ?"

"ఇల్లా రాశారేమిటి, పోనిస్తురూ. రోజూ మాట్లాడుకునే సంగతులన్నీ కథలో రాయడం ఎందుకూ, పత్రికకుకూడా పంపించుతారేమిటి?"

"రోజూ జరిగేసంగతులై తేమాత్రం కథ కాకూడదా ఏమిటి? బాగుందా లేదా, అది చెప్పా- చెప్పమరి–బాగుంటే పత్రికకు పంపిస్తాను."

"బాగుండడానికీ, బాగులేకపోడానికీ ఏముంది కాని, పేరుకూడా నాదే పెట్టారేమిటండీ; మనవాళ్ళ వరేనా చదివితే ఏమనుకుంటారు?"

"ఏమనుకుంటారు? నువ్వెంతో మంచిదాని వనుకుంటారు! కావలిస్తే చదివి వినిపించు."

"సరిపోయింది! ఎవరేనా నవ్వుతారండీ; అది చదువుతూంటే నాకే సిగ్గువేసింది. అందరిముందరా

వినిపించడంకూడానా! ఏం బాగుంటుంది! మీతో నేను వాదించలేనుకాని, నామాటవిని వూరుకోండి; యిప్పటికే అంటున్నారు.''

''ఏ(వంటున్నారు?''

''ఏమంటారు? మిమ్మల్ని పూర్తిగా వశం చేసేసుకున్నాననీ; మరి అనడానికేముంది.''

''ఆమాట నిజంకాదేమిటి? ... నవ్వుతావెందుకూ?అనుకూలవతి ఆయిన భార్యకు భర్తవశుడైతే, అదీ తప్పేనా?''

''సరే; మీతో వాదించలేనని మొదటే చెప్పానుకదూ; యింతకీ, యిదేం రామాయణమూ, భాగవతమూ, నలుగురికీ చదివి వినిపించడానికి?''

''పోనీతె, నీకంత యిష్టంలేకపోతే మానేకాని, మీ ఆడవాళ్ళతో వున్నదేయిది! సబవూ లేదు, సందర్భమూ లేదు, అన్నిటికీ సిగ్గే.''

''జానాను; యిందాక నేస్తం అంతసేపు మాట్లాడుతున్నా ఒక్కమాటేనా మాట్లాడావూ? యిక్కడ చెబుతా రన్నీను; పైని ఒక్కమాయితో గట్టిగా, తలఎత్తి, జవాబు చెప్పలేరు!''

''అది సిగ్గనుకున్నావా ఏమిటి? కొత్తలో అట్టే చనువుగా మాట్లాడితే ఏమనుకుంటుందో అని అట్టే మాట్లాడలేదు; తెలుసునా? మీ అమ్మదగ్గర కాని,

నేస్తం అమ్మదగ్గర కాని, పెద్దవాళ్ళదగ్గర ఎప్పుడేనా సిగ్గుపడ్డానా? చిన్నవాళ్లదగ్గర కొంచెం అలాగే మాట్లాడాలి."

"ఈ చెప్పడానికేం లెండి; నేనూ చెపుతాను. నేస్తంకిమాత్రం యిదివరకు మీతో చనువుండాఏమిటి? సరదాగా కబుర్లు చెప్పిందా లేదా?"

"పోనీకాని, ఈ కథ ముగించేసీదా, యింకా రాసీదా?"

"ముగించేండి; వూ అదేసంభాషణా? ఓ కథేమేనా వుందిగనకనా?"

"నీకు పిల్లడేనా పుట్టకుండా ముగించేసీదా? శుభంతో నేకాని, కథ ముగించకూడదే."

"పుట్టాక మళ్లీ రాద్దురుగాని, ఈపాటి కిక్కడి కుంచేయండి. ఎక్కడికి, చాలునులెండి."

"నీమీద కథ నీకిష్టంలేకపోయాక మరెందుకూ రాయడం; కాని, ఎలా ముగించమంటావుమరి?"

"నాకేం తెలుస్తుంది; ఎల్లాగో ఒకలాగు ముగించేద్దురూ."

"మిగతాదికూడా సిరాతో రాసిపెడుదూ, సంతోషిస్తాను. దీపాలు వెలిగించాలేమిటి?"

"వదినేనా, అక్కయ్యేనా వెలిగిస్తారులెండి."

"భోజనం చేశాక నేస్తం యిక్కడికి వస్తానంది

మైన అనుభూతికో, మార్పుకో, కొంతవరకు దారితీయ వచ్చును.

సత్యంమటుకూ అప్పుడీ తర్కచర్చ చేసే స్థితిలో లేడు. ఆమె ఎవరై వుంటుందా అనో, నిన్న నామె ముఖం సరిగా చూడనందున ఆమె రూపు ఇలా ఉంటుందనో ఊరికినే ఏదో ఛాయామాత్రంగా ఊహిస్తూ కూర్చున్నాడు. అవాళ శనివారం, సెలవు రోజని ఒక్కసారి జ్ఞాపకం వచ్చింది. ఎందుచేతో చాలా సంతోషం కలిగింది.

అప్రయత్నంగా లేచి జామిచెట్టుకేసి వెళ్ళి పోయాడు. చెట్టెక్కి రెండో వేపు చూచేడు; ఎవ్వరూ కనిపించలేదు. బహుశా ఆమె వంటపనుల్లోవుందేమో? ఆవుల శాలనుంచి ఆవుమటుకు రెండడుగు లితని వేపు వేసి తలాడించింది. దూడకూడా సత్యం వేపే చూచింది. సత్యానికి ఆవుని, దూడనికూడా దువ్వాలనిపించింది. కాని ఆవలి పెరట్లోకి దిగటేతప్ప చెట్టుమీదనుంచి సాధ్యపడదు. వాటికేమీ తోచడంలేనట్టు, ఎవరేనా వచ్చి దువ్వితే బాగుండు ననుకుంటున్న ట్లనిపించింది. ఆవు, దూడ ఎంతబాగున్నాయి! సత్యం వాటివేపే చూస్తూ, చిన్నపిల్లాడిలా తలాడిస్తూ నవ్వుతూ వింత సంజ్ఞలు చేయసాగేడు. సత్యం చేసిన సంజ్ఞలు వాటికి బోధపడ్డట్టు అవికూడా తలలాడిస్తూ అతనివేపే యింకా

ముందుకొచ్చాయి. అప్పుడే వాళ్ళమ్మ లోపటినుంచి 'ఏమిరా, స్నానంచేశావా?' అని కేకేసింది. వెంటనే చెట్టుదిగి స్నానానికి వెళ్ళాడు.

భోజనాలయాక వాళ్ళ నాన్నగారు కచేరీకి వెళ్లిపోయారు. చెల్లెలు, పన్నెండేళ్ళు దాటినది, ఆడపిల్లల బడిలో చదువుకుంటూంది, 'డ్రాయింగులకి రంగు వేసి పెట్ట వన్నయ్యా' అంటూ అతనిదగ్గర కొచ్చింది. 'గర్ల్సుస్కూల్ మానేస్తూ. అస్తమానూ డ్రాయింగులూ, రంగులువేయడంతప్ప యింకేమీ చెప్పరా ఏమిటి? రేపు రంగు లేస్తాను; ఆదివారం, సెలవేకదా' అని చెల్లెలిని పంపేశాడు. స్పష్టంగా తెలియరాని తీయని ఆకర్షణాప్రోద్బలంవలన ఏ ప్రత్యేకోద్దేశమూ లేకుండానే పెరట్లోకి వెళ్ళాడు.

ఆ వసారాలోకి మధ్యాహ్నం సాధారణంగా ఎవరూ రారని అతనికి తెలుసును. ఏ కేశం కా లేకుండా చెట్టెక్కి కూర్చోవచ్చును, కాని అస్ఫుటమైన జంకూ, ఆందోళనాకూడా కొంతవరకతని మనసు నావరించాయి. వాటితోపాటు ఓ అస్పష్టమైన ఆశానందమూ, తీయని కుతూహలమూకూడా మేళవింప లేకపోలేదు. ఏదో మధుర సంఘటన జరగవచ్చుననే ఉత్సాహంతో సత్యం చెట్టెక్కి, ఎప్పటిలాగే ఓ కొమ్మని చేరబడి మరోకొమ్మని పట్టుకొని సదుపాయంగా కూర్చొని

కదూ? మీరు మాట్లాడుకోండి. వెన్నెలొస్తుంది, నే నాలా షికారు వెళ్ళివస్తాను.''

''మీరుకూడా వుండండి, మరి పాటెప్పుడు వింటారు; భోజనాలయాక పాడతానంది కదూ? యింకా వేళవుంది. ఇప్పుడే కాస్తసేపు తిరిగిరండి. త్వరగా రావాలి. రే పట్లతదియ. భోజనాలు వేగమే అవు తాయి.''

''రేపేనా అట్లతదియ, గోరింట పెట్టుకోరూ?''

''భోజనా లయాక పెట్టుకుంటాం.''

''ఎవరెవరు పెట్టుకుంటారు?''

''అంతా పెట్టుకుంటాం. అన్నయ్యకూడా చిటికెనవేలికి పెట్టుకుంటాట్ట.''

''నేనూ పెట్టుకుంటాను. సరే! అయితే కాస్తలా వెళ్ళివస్తాను. ఉత్తరీయం దండేన్నివుంది; తీసుకు వస్తావూ?''

''అలాగే, తెస్తున్నా.''

సమాప్తం

# రాధమ్మ

## ౧

అవాళ వాళ్ల లెక్చరర్ రాకపోవడాన్ని మధ్యాహ్నం రెండున్నరకే సెలవు వచ్చింది సత్యానికి. ఇంటికి వస్తూనే పుస్తకాలో మూలాల పారేసి, గబగబా నూతివద్ద వొళ్ళూ ముఖమూ కడుక్కొని, 'అమ్మా, ఆకలేస్తూంది; కాఫీ కాచుకుంటాను' అని కేకేసి, వంటింటి సంసారాల్లోకి వెళ్లాడు. వాళ్ళనాన్నగారింకా ఆఫీసునుంచీ, చెల్లెలు బడినుంచీ రాకపోవడాన్నీ, అమ్మా, అమ్మమ్మా పనులు పూర్తిచేసుకుని నడుం వాల్చి విశ్రాంతి తీసుకుంటూనో, కొట్టుగదిలో ఏవో సద్దుతూనో ఉండడాన్నీ. యింట్లో అలికిడి లేదు. తన మటుకు తానే అప్పుడప్పుడు కాఫీ కలుపుకొని పుచ్చుకోవడం సత్యానికి సరదా. అలవాటు ప్రకారం 'అమ్మా' అని కేకవేశాడేకాని, వాళ్లమ్మకి వినిపించిందో లేదో తెలుసుకోడానికి ప్రయత్నించకుండానే అల్మారునుంచి పాలూ, పంచదారా తీసి, తనకి నచ్చినట్టు చిక్కగా డికాక్షను కలుపుకొని, తనవేపే చూస్తూ మ్యాంవ్ అంటూన్న పిల్లి కిన్ని పాలుపోసి, దానివేపే చూస్తూ మెల్లిగా కాఫీ తాగసాగేడు.

సత్యానికీమధ్యే పనిచేసేటప్పో ఏమో వచ్చింది. ఈసంవత్సరమే యింటరులో చేరాడు కూడాను. యౌవనచిహ్నాలిప్పుడిప్పుడే కొద్దిగా అంకురిస్తున్నా, బాల్యవయసును స్ఫురింపచేసే అమాయికపు విశ్వాసం సత్యంముఖంలో యింకా ప్రతిఫలిస్తూంది. ఒకమనిషికు లక్ష్య ముండకుండా, గౌరవమూ సత్సంప్రదాయమూ నిలబెట్టుకుంటూ వస్తూన్న శాస్త్ర సంపన్నమైన కుటుంబానికి చెందినవాడు సత్యం. మనస్పర్ధలూ, వైరభావాలూ లేకుండా, అట్టి కుటుంబాల్లో పెరిగిన పదహారేళ్ళబ్బాయికుండే ఆరోగ్యమూ, ఉల్లాసమూ అతనికి పూర్తిగా ఉన్నాయి. అతని చదువూ, ఆటపాటలూ, ఎప్పుడేనా బజారుసామానులు తేవడంవంటి సామాన్య గృహకృత్యాలూ తప్ప యింకే బెంగలూ, బాధ్యతలూ ఎరగడు సత్యం. సన్నగా, పొడుగ్గా యింకా ఎదుగుతూన్న దేహసౌష్టవమూ, బాల్యనైర్మల్యాన్ని ప్రతిఫలించే అరైన ముఖమూ సత్యానికో వింత ఆకర్షణనిస్తున్నాయి.

కాఫీ తాగుతూ, పరధ్యానంగా, వాళ్ళ పెరటిగోడ కానుకొని వున్న జామిచెట్టుకేసి చూచాను. చెట్టునిండా ముదిరిన కాయలే కనిపించాయి. చెట్టుకొమ్మలు కొన్ని గోడకావలివేపు కూడా విస్తరించాయి. కోసుకుతినడానికి పండ్లున్నా లేకపోయినా, ఆచెట్టుకి

అప్పుడప్పుడు కూర్చోవడం సత్యాని కలవాటు. అలికిడి లేని ఆవలి పెరట్లోకి జామిచెట్టు మీదనుంచి చూడడం సత్యానికి సరదా. అయింట్లో ఎప్పుడూ ఎవరూ ఉన్నట్టే వుండేది కాదు. ఏ వీధికీ చెందనట్టూ, ఏదో మూలని గుప్తంగా కట్టుకున్నట్టుండేది ఆ గృహమూ, వాతావరణమూ, ఆ పెరట్లో చిన్న ఆవులశాలా, గన్నేరు, మందార, బొడ్డుమల్లి యింకేవేవో పూల మొక్కలూ — ప్రశాంతంగా, వింతగా వుండేది; ముఖ్యంగా ఆవలివైపు భూమట్టము బాగా మొరకగా ఉండి గోడ అటునుంచి నాలుగడుగులే ఎత్తు ఉండటమూ, సత్యం వాళ్ళింటివేపునుంచి ఆరడుగుల ఎత్తుండడమూ, తమాషాగావుండి, ఆదృశ్యం ఎంతసేపేనా చూడాలనే వుండేది.

జామికాయలు చూడగానే గబగబా మిగిలిన కాఫీ తాగి, గ్లాసక్కడ పడేసి, సత్యం చెట్టెక్కాడు. బాగా పండినది దొరక్క, జామిపండ్ల వేపు అప్పుడట్టే మనసుపోకనో ఒక కాయనూ తెంపే ప్రయత్నం చెయ్యలేదు. గాలికి ఉండుండి కొద్దిగా ఊగులాడే ఓ కొమ్మని చేరబడి, మరోకొమ్మని పీటగా పట్టుకొని, మామూలుగా చూచేటట్టే ఆవలిపెరట్లోకి చూచేడు. ఒక్కసారి తుళుక్కుపడ్డాడు; ఒళ్ళు జలదరించింది. పూలమొక్కలవారని ఒకామె కలంటుకు నీళ్ళు పోసు

కుంటూంది. ఆమె వొంటిని బట్ట ఉన్నట్టు లేదు. దాసీది బట్టగదోపుకొని పులుసుపోసి ఆమె ఒళ్ళు రుద్దుతూంది. ఆమె కాళ్ళు ముడుచుకొని, చేతులతో కళ్ళు మూసుకొని, వొంగి కూర్చొని ఉండడాన్నీ, దాసీది యితనికి పెడముఖంగా ఉండడాన్నీ, సత్యం చెట్టుమీద ఉన్న సంగతి వాళ్ళెరగరు. నున్నగా మెరుస్తూన్న మేనికాంతి ఒత్తుగా, చీలికలు చీలికలుగా ఆమెను కప్పివేస్తూన్న జుట్టులోంచి, ఎడతెగక దట్టంగా పైకి ప్రవహిస్తూన్నట్టున్నది. స్త్రీసహజమైన లజ్జతో తన అందాన్నీ, ఆకర్షణాకారహస్యాన్నీ [...]డు ష్టంగా మరుగుపరచే తీరులో ఆమె కూర్చున్నా, దాసీది ఒళ్ళు రుద్దినప్పుడు గిలగింతలు పెట్టినట్టు సౌష్టవయుతమైన ఆమె దేహ లావణ్యమంతా నిండుగా నవ్వుతూ, బంధిస్తూన్న కుంతలముల నుంచి తప్పించుకు పరిగెట్టుకొంది.

ఈ దృశ్యమంతా కొయ్యబొమ్మలా కొమ్మని చేరబడి చూస్తున్నాడు సత్యం. వేడినెత్తురు అతని శరీరమంతా వేగంగా ప్రవహింపసాగింది. గుండె గట్టిగా కొట్టుకోసాగింది. ఏవో ఉద్రేకపూరితమైన శక్తులో, విచిత్రమైన అనుభూతులో పెద్ద పెద్ద కెరటాల్లా అతనిలో చెలరేగి అతని కెంతమాత్రం స్వాధీనంకాక, అర్థంకాక అల్లల్లాడించేస్తున్నాయి. అర్థంకాని మహాప్రళయంలా తోచే ఆకస్మిక ప్రథమయౌవనసమాగమంలో చిక్కు

కోని, తాను చేస్తూన్నపని మంచిదా, చెడ్డదా అన్న ఆలోచనకాని, మత్తెక్కించేలా నాట్యం చేస్తూన్న ఆ నగ్న సౌందర్యాన్ని చోరునివలె చూచి ఆనందించ వచ్చునా అనికాని అతని కెంతమాత్రమూ తట్టలేదు; అట్టి తలంపుల కతని మనసులో అప్పుడు చోటులేదు కూడాను; యిదంతా కొద్దిపాటి క్షణాలు మాత్రమే.

ఇంతలోనే రుద్దడం అయి దాసీది నీళ్ళుపోస్తూంటే ఆమె వొంగుని నిలబడ ప్రయత్నిస్తున్నప్పుడు, ఆమె తనవేపు కొంపతీసి చూస్తుందేమోనని పెద్దజంకూ, చేయరానిపని తాను దొంగతనంగా చేస్తున్నానేమో అనే ఆందోళనా చటాలున కలిగాయి. కాని ఆమె వొంగుని నిలబడ్డప్పుడుండే శరీరపు వంపులూ, యినుమడించినట్లున్న దేహలాలిత్యమూ, నిజం చెప్పాలంటే, సత్యాన్ని మరీగాఢంగా ఆకర్షించాయి. అయితే, సహజంగా కల్మష మెరుగని చిన్నవాడవటంచేత ఈ కొద్దిక్షణాలపాటి గాఢానుభూతిలోనే సిగ్గుతో కూడిన కలవరపాటుకూడా కలిగింది. తాను వెంటనే చెట్టు దిగిపోవాలని అతనికి స్ఫురించింది.

ఇంతలోనే వసారాలో గళాసుల చప్పుడువిని, ఊపిరి బిగపట్టి ఇటు తిరిగిచూచేడు. అతని చెల్లెలు అక్కడున్న మిగిలిన డికాక్షనుతో కాఫీ కలుపుకుంటూంది. తనని చూచి 'నా కో జాంపిపండు కోసి

యివ్వావు అన్నయ్యా' అని గట్టిగా అంటుందేమో, పక్కింటివాళ్ళు విని తనని చూస్తారేమోనని భయం వేసి చప్పున చప్పుడు కాకుండా చెట్టు దిగిపోయాడు.

ఆ నాటి జతని దృష్టంతా అటువేపేవుంది. ఆ రాత్రీ, రెండోరోజు తెల్లవారగట్ల లేస్తూనే, ఆ సంగతులే జ్ఞాపకంవచ్చి అతన్ని గగుర్పాటు పడచేశాయి. కాఫీ తాగి పొద్దున్న తనగదిలో చదువుకోడానికి కూర్చున్నప్పుడుకూడా ఉండుండి లీలామాత్రంగా ఆ దృశ్యాలే మనసులో నాట్యం చేయసాగాయి. నిర్మలాకాశంలో మేఘాలవలె, కల్మషరహితమైన అతని మనసులో, నిన్న తటస్థపడ్డ దృశ్యంమూలంగా, అర్థంకాని ఏవో తీయనివాంఛలతో తన ప్రవర్తననుగూర్చి అస్పష్టమైన శంకలుకూడా రేకెత్తసాగినవి.

ఇదేమీ అసాధారణ సంఘటన కాదు. సామాన్యకుటుంబాల్లోకూడా అప్పుడప్పుడూ ఇటువంటి సన్నివేశాలు, అర్ధనగ్నదృశ్యాలో, నగ్నదృశ్యాలో తాత్కాలికమాత్రం తటస్థపడుతూంటాయి. సరళతకు భంగమేమోనని వాటిప్రసక్తి చేయం. అట్టే పట్టించుకోం. సాధ్యమైనంతవరకూ గుర్తించనట్టే ప్రవర్తిస్తాం. అయితే ప్రత్యేక పరిస్థితులనూ, సంబంధనైజమునూ, వయసునూపట్టి సామాన్య సంఘటనలుకూడా ఒక్కొక్క వ్యక్తిజీవితంలో అసాధారణప్రాబల్యం వహించి గాఢ

మైన అనుభూతికో, మార్పుకో, కొంతవరకు దారితీయ
వచ్చును.

సత్యంమాటుకూ అప్పుడీ తర్కచర్చ చేసే
స్థితిలో లేడు. ఆమె ఎవరై వుంటుందా అనో, నిన్న
నామె ముఖం సరిగా చూడనందున ఆమె రూపు ఇలా
ఉంటుందనో ఊరికినే ఏదో ఛాయామాత్రంగా
ఊహిస్తూ కూర్చున్నాడు. అవాళ శనివారం, సెలవు
రోజని ఒక్కసారి జ్ఞాపకం వచ్చింది. ఎందుచేతో
చాలా సంతోషం కలిగింది.

అప్రయత్నంగా లేచి జామిచెట్టుకేసి వెళ్ళి
పోయాడు. చెట్టుక్కిందో వేపు చూచేడు; ఎవ్వరూ
కనిపించ లేదు. బహుశా ఆమె వంటపనుల్లోవుందేమో?
ఆవుల శాలనుంచి ఆవుమాటుకు రెండడుగు లితని వేపు వేసి
తలాడించింది. దూడకూడా సత్యంవేపే చూచింది.
సత్యానికి ఆవుని, దూడనికూడా దువ్వాలనిపించింది.
కాని ఆవలి పెరట్లోకి దిగడం తేతప్ప చెట్టుమీదనుంచి
సాధ్యపడదు. వాటి కేమీ తోచడంలేనట్టు, ఎవరేనా
వచ్చి దువ్వితే బాగుండు ననుకుంటున్నట్లనిపించింది.
ఆవు, దూడ ఎంతబాగున్నాయి! సత్యం వాటివేపే
చూస్తూ, చిన్నపిల్లాడిలా తలాడిస్తూ నవ్వుతూ వింత
సంజ్ఞలు చేయసాగేడు. సత్యం చేసిన సంజ్ఞలు వాటికి
బోధపడ్డట్టు అవికూడా తలలాడిస్తూ అతనివేపే యింకా

రెండో వేపు చూచాడు. ఎవ్వరూ లేరు. దూడ అటు తిరిగి గడ్డి మేస్తూంది. ఆవుని పాలవాడు తోలుకుపోయి వుంటాడు.

పెరట్లో ఒకచీరె ఆరవేసివుంది. ఒకకొస పక్కింటి పెరట్లోకి వాలినజామికొమ్మకే ముడివేసివుంది. అప్పు డాకాశంమీద సూర్యునికడ్డముగా మేఘాలుండ టాన్ని ఎండ తీక్ష్ణత లేకుండా చల్లగావుంది. ఊరికినే చెట్టుకొమ్మల్లో కూర్చుంటేనే హాయిగావుంది. చిరు గాలికి కొద్దిగా ఆడుతూన్న చీరెను పరధ్యానంగా చూస్తూ, పగటిస్వప్నంలాంటి ఊహాగానంలో పడ్డాడు. ఆపక్కింట్లో యింకెవరున్నారో అతనికి తెలియక పోయినా, ఆచీరెమటుకూ ఆమెదే అని సత్యానికి తట్టింది.

ఇంతలోకే ఆమె పైకివచ్చింది. సత్యంవళ్ళు ఝల్లుమంది. తననిచూస్తుందేమో. చూచి ఏమేనా అనుకుంటుందేమో అని చెడ్డభయంవేసింది. కదల కుండా, ఊపిరేనా గట్టిగా పీల్చకుండా, కూర్చున్నాడు. ఆమె ఆరవేసిన చీరె అవలికొసవిప్పి, జామికొమ్మకు కట్టినకొసవేపే వస్తూంది. గుండె దడదడ కొట్టుకో సాగింది. ఇంకా ఆమె సత్యాన్ని గమనించలేదు. తీరా దగ్గరకొచ్చాకచూస్తే బాగుంటుందా? అందుచేత, తానేదో కాయలు కోసుకోడానికే చెట్టెక్కినట్టూ,

ఆమెను చూడనట్టూ, ఓపలక బారిన పండు తెంపడానికి కొంచెం పైకొమ్మ ఎక్కిపోయాడు.

సరిగ్గా ఆసమయానికే ఆమెకూడా అతన్ని చూచింది. తనవేపు చూస్తూందని సత్యానికి, అటు చూడకపోయినా, తెలిసి చాలా కంగారుపడిపోయాడు. తెంపుతూన్న ఫలం చేతిలోంచిజారి, ఆవలిపెరట్లో ఆమె దగ్గరనే పడింది. ఆమెవద్ద పడవేసే ఉద్దేశంకాని, అట్లా పడవేయడానికి ధైర్యంకాని తన కెంతమాత్రం లేవని సత్యానికి తెలిసినా, కంగారులో దొరగాపండిన ఆ మంచిఫలం ఆమెదగ్గిరగా పడడం ఆతనికోవిధమైన సంతృప్తినే కలిగించింది.

ఆమె యితన్నిచూచి కంగారుకాని, బిడియం కాని ఏమీ లేకుండా మామూలుగానే ఆఫలంతీసి 'ఇదిగో' అని గోడవద్దకొచ్చి యివ్వబోయింది. అతను తీయపోయిన ఫలం జారి వాళ్ళింట్లో పడ్డప్పుడు ఆమె తీసుకోమని యివ్వడంలో విపరీతమేమీ లేక పోయినా, గోడవద్దకువచ్చి అట్లాచనువుగా మాట్లాడడం సత్యానికి చాలాసంతోషమూ, ఉల్లాసమూ కలుగజేశాయి. ఏదోవిధంగా ఆమెకు ఋణపడినట్టు కూడా అనిపించింది. ఇంకా కంగారు పూర్తిగావదలకపోయినా స్వభావంచేత చురుకైన కుట్రవాడు కనుక "మీరు తీసుకోండి; చెట్టునిండా చాలా ఉన్నాయి" అన్నాడు.

ఆమె నవ్వుతూ, పండు నక్కుడే కొరికి తింటూ, "బాగా పండింది సుమా" అంది. జంకువదలి "ఇంకొకటి కోస్తే దండీ?" అన్నాడు "చాలు, చాలు; మరొద్దు" అంటూ ఆమె వెళ్ళిపోయింది.

ఆమె వెళ్ళిపోయిన కొంతసేపువరకూ సత్యం అలాగే చెట్టుమీద కూర్చున్నాడు. ఇదివరకెన్నడూ ఎరుగని మధురభావాలతో హృదయం నిండి వికసింప సాగింది. అతి సున్నితంగా ఎవరో హృదయతంత్రులను మీటుతున్నట్టు, మనోఫలకముపై చిరస్మరణీయములైన చిత్రాలేవో నాట్యం చేస్తున్నట్లనిపించింది. అతని అమాయకపు ముఖంలో ఓ నూతనోత్సాహం ప్రతిఫలించింది. సర్వసాధారణమైన ఈ సన్నివేశంలో విశేషమేమీ లేకపోయినా, ప్రథమ సందర్శనంలోనే ఆమెతో సన్నిహితపరిచయం కలిగినట్టు తోచింది. చెట్టు దిగేముందుమటుకూ, చెల్లాయికి కూడా జాంపండ్లు కోయాలని గుర్తుకొచ్చింది.

రెండోరోజు భోజనం చేసేవరకూ, నిన్న నామె తనతో మాట్లాడిందన్న సంతృప్తితోనూ, మళ్ళీ యివాళ కనిపిస్తుందేమోనన్న ఉత్సాహంతోనూ గడిపాడు సత్యం. అవాళ ఆదివారం అవడంనుంచి, వాళ్ళ నాన్నగారు పడుకోగానే, అంతా ఏవో పనుల్లో ఉండడం చూచుకొని పెరటి వసారాలోకి వెళ్ళాడు.

చెట్టెక్కి అరగంటసేపు ఆత్రుతతో చూచినా ఎవ్వరూ కనిపించలేదు. ఆమె కనిపించగానే ఏదో మిష పెట్టి యివ్వొచ్చునని మంచి జాంవిపండ్లు రెండు కోశాడు కూడాను. ఆశాభంగమే అయింది. కొంచెంసేపు పోయాక తిరిగీ రావచ్చునని దిగిపోబోయాడు. ఇంతలోనే పక్కింటివాళ్ళ వసారాతలుపు తెరిచిన చప్పుడయింది. ఎవరో చూద్దామని కాస్త ఆగేటప్పటికి వసారాలో కామె వచ్చింది. తనని చూడకుండానే వెళ్ళిపోతుందేమోనని, ఆమెకు తను చెట్టుమీద నున్నట్టు తెలిసేందుకు, చొరవచేసి మరో కొమ్మకు కదిలాడు.

అనుకున్నట్టుగానే ఆమె యితన్ని చూచింది. చూడగానే నవ్వుతూ, "ఏం, పం డ్లేమేనా దొరికాయా?" అంటూ పెరట్లోకివచ్చింది. "మీకోసమే నండీ; యివిగో మంచిపండ్లు" అంటూ సత్యం సంతోషంతో ఫలాల్ని తీశాడు. "మంచివన్నీ నాకిచ్చేస్తే మరి మీయింట్లోకి వద్దూ?" నవ్వుతూఅంటూనే దగ్గర కొచ్చి గోడనానుకొని నిల్చున్నదామె. "ఇంకా ఉన్నాయండీ" అంటూ ఆమె కందించాడా ఫలాన్ని. ఎప్పుడూ నవ్వుతూన్నట్టే ఉన్నవామె ముఖమూ, కళ్ళూ, పెదిమలూ, చెక్కిళ్ళున్నూ. ఆమెకంత సామీప్యంలో ఉండడం సత్యానికి సంతోషంతోపాటు

మొహమాటంకూడా వేసింది. సిగ్గుతో ఎఱ్ఱపడిన వాతని చెక్కిళ్ళు. తత్తరపాటుతో చూపులామెనుండి మరల్చుకున్నాడు. ఆమె అది గమనించిందో లేదో కాని, చనువుగా, పరిచయవర్గంలోని వారితోవలెనే, మాట్లాడడం నుంచి అతనికి కంగారు బాగాతగ్గి ఆమె ఎడల ఎంతోయిష్టమూ, స్నేహభావమూ కలిగాయి. అంతేకాకుండా, తాను చేస్తున్న పనిలో విపరీతంకాని, రహస్యవిషయంకాని ఏమిన్నీ లేనట్టే స్ఫురింపచేసింది ఆమె తీరు.

ఆమె నవ్వుతూనే "మరి నీ పేరేమిటి?" అంది.

"సత్యం అండీ."

"ఏం చదువుకుంటున్నావు?"

"ఇంటరులో కొచ్చానండి."

"అన్నదమ్ములూ, అక్కచెల్లెళ్ళూ ఉన్నారా?"

"చెల్లాయి ఒక్కత్తేనండి; బడిలో చదువు కుంటూంది. మీ యింట్లో ఎవ్వరూ ఉన్నట్టుండ దేమండీ?"

"మాయింట్లో నేనొక్కర్తెనే; ఆయనా నేనే. అన్నట్టు పాలుదింపడం మరిచిపోయాను. వస్తాను" అని ఆమె వెళ్ళిపోయింది. మళ్ళీ వస్తుందేమో అక్కడే కూర్చుందామా అనుకున్నాడు. కాని బాగుండదేమో అనిపించి చెట్టుదిగిపోయాడు.

క్రమక్రమంగా సత్యానికామెతో స్నేహమూ, చనువూ పెరగసాగినవి. తరుచుగానే ఆమెను కలుసుకోవడం తటస్థపడేది. ఫలానా అప్పుడు అని అనుకోక పోయినా, సాధారణంగా సత్యం చెట్టెక్కి కూర్చున్నప్పుడు వెంటనే కాకపోయినా, కొంచెం సేపట్లోనేనా ఆమె సందర్శనం లభించేది. ఈ సంగతులూ, ఆసంగతులూ అప్పుడప్పుడు మాట్లాడుకునేవారు. చూచి నప్పుడల్లా మాట్లాడుకోకపోయినా, ఆమె అతన్ని చూచి పలకరించినట్టుగా నవ్వి యింటిపనులు చూచుకోడానికి లోనికి వెళ్ళినా సత్యానికోవిధమైన సంతృప్తి కలిగేది.

తన యింట్లోవాళ్ళు సాధారణంగా పెరట్లోకి రానిసమయాల్లోనే ఎప్పుడూ తాను చెట్టెక్కుతూ వచ్చినా, ఆమె ఎట్టి సంకోచమూ లేకుండా చనువుగానూ, అతిసహజంగానూ ప్రసంగిస్తూండడంవల్ల తానిట్లా ఆమెను కలుసుకోవడం సత్యానికి కూడా నిస్సంకోచమైన సామాన్య విషయంగానే అనిపించసాగింది. ఆమె సాహచర్యం మటుకూ ఎవరికీ లభించని గుప్తఅదృష్టమే అనిపించింది. ఆమె ఎడల తీయనిఆకర్షణా, స్నేహభావమే కాకుండా ఒకవిధమైన గురికూడాం కుదరింది. అతనికంటే వయసులో మరీఅంత పెద్దకాదని తెలిసినా, ఆమెసాన్నిధ్యంలో ఎందుచేతనో తానొక శిష్యుడ ననిపించేది. నిజానికి సత్యం యింకా పూర్తిగా బాల్యా

వస్థను పీడలేదు; కనుక ఆమెయందు గౌరవభావమూ, ఒకవిధమైన అడకువా కలగడంలో ఆశ్చర్యమేమీలేదు.

ఓరోజు సాయంకాలం సత్యం చెట్టుక్రిందకూర్చొని వుండగా ఆమె మామూలుగానే అతన్ని చూచి నవ్వి గోడవద్దకొచ్చి, "ఏం సత్యం, సాయంకాలం ఏమీ ఆటలాడడంలేదూ? రోజంతా ఇంట్లోనే కూర్చున్నట్టుందే" అంది.

సత్యం కొంచెం కలవరపడి, "అబ్బే లేదండీ; ఇవాళ ఊరికినే ఉన్నాను" అన్నాడు.

"కాలేజీకి సరిగ్గా వెళుతున్నావా? పాఠాలు బాగా చదువుతున్నావా?" తిరిగి అడిగింది.

"వెళుతున్నాను; బాగానే చదువుతున్నానండీ" అన్నాడు. మరికొంచెంసేపట్లో ఆమె వెళ్ళిపోయింది.

సత్యం చెట్టు దిగిపోయాడు. మనసు కొంచెం ఆందోళనలో పడ్డది. కొద్దిరోజులై నిజంగానే చదువు కాస్త అశ్రద్ధ అవుతుందేమోననే అనుమానం కలిగింది. కాలేజీ ఆటల్లో కూడా మునపటంత ఉత్సాహంతో పాల్గొనడం లేదేమోననిపించింది. సిగ్గుపడ్డాడు. ఆనాటినుంచీ పాఠాలు ఏమైనాసరే శ్రద్ధగా చదువుకోవాలనీ, పరీక్షల్లో యిదివరకు వలెనే ఎక్కడా తప్పకుండా ముందుకే కూడా వేసవుతూండాలనీ గట్టిగా నిశ్చయం చేసుకున్నాడు. అంతేకాకుండా కాలేజీలో

టెన్నిస్‌లో కూడా చేరాడు. సొష్టవంగా కండరాలు పెరిగేందుకు, ఈ ప్రసంగం తరువాతనే, కసరత్తు చెయ్యడం కూడా మొదలెట్టాడు. ఆరోగ్యంగానూ, ఆకర్షణీయంగానూ ఎదుగుతూన్న అతని దేహంతో పాటు విశిష్టమైన నూతనోద్దేశాలూ, ఆశయాలూ కూడా పెరగసాగాయి.

ఆశయాలూ, నూతనభావాలూ ఈవయసులో రేకెత్తడం సహజమే. కాని ఆమెతో కలిగిన ఈ కొద్ది దినాల సాహచర్యమూ, స్నేహమూ చాలావరకూ ప్రేరితకారణం మవకపోలేదు. తన చదువు గురించీ, ఆటలగురించీ ఆమె అడిగిన తరువాత వారం రోజుల వరకూ మాత్రం సత్యం చెక్కెట్టకి దానికి వెనుకతీశాడు. శ్రద్ధగా చదువులోపడి టెన్నిస్‌లో చేరినవరకూ ఏదో లోపం కలిగిందనే భావం పోలేదు. శెలవు రోజున మధ్యాహ్నంవేళ మటుకూ ఆమెనోసారి చూడాలనీ, టెన్నిస్‌లో చేరినసంగతికూడా చెబుదామనీ, అభిలాష హెచ్చి గబగబా పెరట్లోకి వెళ్ళి జామిచెట్టెక్కాడు.

నిశ్శబ్దంగా ఉంది. ఎవ్వరూ లేరు. శాలలో గడ్డి మేస్తూన్న ఆవునిచూస్తూ కూర్చున్నాడు. తింటుం దేమోనని ఆవువద్ద ఓ జామిఫలం పడవేశాడు. మేత పదార్థమేమోనని ఆవు ముందుకు వచ్చింది. ఈదృశ్యం వినోదంగా చూస్తూన్న సత్యం ఆమె పెరట్లోకి రావడం

గుర్తించలేదు. 'ఏమిటల్లా చూస్తున్నావు సత్యం?' అని ఆమెకంఠస్వరం వినిపించేసరికి, కొద్ది సంభ్రమపాటుతో 'మీ ఆవు చాలాబాగుంటుందండీ' అన్నాడు అనూయకంగా. కొంతసేపు కబుర్లు చెప్పుకున్నారు. సత్యం టెన్నిస్‌లో చేరినసంగతి విని ఆమె చాలా సంతోషించింది. 'తప్పకుండా మీరు కాలేజీ మేచెస్‌లో గెలుస్తావులే' అంది, నవ్వుతూ. తరువాత ఆమె వెళ్ళిపోయింది. సత్యమూ చెట్టు దిగిపోయాడు.

చనువుమూలానా, ఆటల్లోనూ ఆసక్తి హెచ్చడం చేతనో మరే కారణం చేతనో కాని, ఆమెయందలి స్నేహభావమూ, గురీ ఎప్పట్లాగే పెరుగుతున్నా, యిదివరకటంత తరుచుగా చెట్టెక్కడం మానేశాడు. తటస్థపడ్డప్పుడుమాత్రం అన్నిసంగతులతోపాటు తన ఉద్దేశాలూ, ఆశయాలూనూ ఆమెతో ఏ శంకా లేకుండా చెబుతూండేవాడు. తన కింజినీరింగు చదవాలనీ, అమెరికా వెళ్ళాలనికూడా వుందనీ అనూయకపు ఉత్సాహంతో యిట్లాంటివన్నీ చెబుతూండేవాడు. ఆమె అతనితో మాట్లాడినా, తాను చెప్పే సంగతులు ఆమె నవ్వుతూ ఆసక్తితో విన్నా అతనికెంతో సంతోషంగానూ, హెచ్చరికగానూ వుండేది. ఆమె ఆకర్షణా రహస్యమూ, సాంగత్య గుణవిశేషమూ ఎటువంటివో కాని ఆమె చనువుగా కాస్త ప్రసంగించినంత

మాత్రాన్ని, ఆమెను తలపెట్టినమాత్రాన్ని, జీవితంలో ఓ నూతనాసక్తీ, ఉత్సాహమూ కలిగేవి సత్యానికి.

ఆమెకూడా యితనితో సన్నిహిత పరిచయం ఉన్నట్లు స్వేచ్ఛగా మాట్లాడుతూండేది. ఆమె పేరు రాధమ్మనీ, తనకంటే ఏ డెనిమిదేళ్ళు పెద్దదనీ, ఆమె భర్త కామెరెండో పెళ్ళి భార్యనీ, బిడ్డలు లేరనీ సత్యం తెలుసుకున్నాడు. ఆమెభర్త ప్లీడరు గుమస్తా అనీ, ఆయన అనుభవజ్ఞుడూ, మర్యాదస్తుడూ అనీ, ఆయన ఎవరివద్ద పని చేస్తున్నారో ఆ వకీలుగారికే కాకుండా, కచేరీల్లోనూ ప్లీడర్లలోనూ ఆయనంటే చాలా గౌరవం వుందనీ కూడా తెలిసింది. అంతేకాదు, వయసుమళ్ళిన ఆమె భర్త నెమ్మదస్తుడనీ, ఆమెఎడల చాలా అనురాగముతో వుంటారనికూడా తెలిసింది.

ఓరోజు సాయంకాలం, సత్యం కాలేజీనుంచి వచ్చి, కసరత్తూ, స్నానంచేసి కొత్త దుస్తులు వేసుకున్నాడు. ఆవాళ వాళ్ళ హాఫియర్లీ పరీక్షల్లో బాగా మార్కులొచ్చాయని సరదాగావుంది. రాధమ్మకీ సంగతి చెప్పాలని చాలా ఉత్సాహంగా వున్నాడు. పెరటివేపు వెళ్ళబోతూంటే నడిచావట్లో కూర్చున్న వాళ్ళమ్మమ్మ 'ఏమిరా, కనిపించడమే మానేశావు' అంది. సత్యం నవ్వి, ఏవో కబుర్లు చెబుతూ కాస్తసేపు కూర్చున్నాడు. వాళ్ళవ్వ ఈనినసంగతి చటుక్కున

జ్ఞాపకంవచ్చి 'అన్నట్టు మనావు ఈనిందికదూ, జున్ను చేశారా అమ్మమ్మా?' అన్నాడు. 'చేశారు కాని భోజనంచేశాక తిందువుకాని' అందావిడ. 'ఎక్కడ పెట్టావో చెబుదూ, కొంచెం రుచిచూస్తాను' అంటూ లేచాడు. 'అల్మారులోవుంది. ఆట్టే తినకేంబాబూ; పొద్దుపోయింది; రాత్రి భోజనాని కాకలివేయదు.'

'అలాగే' అంటూ లోపలిగది అల్మారువద్దకు వెళ్ళాడు. చెమ్చాతో కొంచెం ప్లేటులో వేసుకుని తింటూ రుచి ఆనందిస్తూండగా, ఏదో ఒక్కసారిగా స్ఫురించి, ఓ గ్లాసునిండా జున్నుతీసి పట్టుకొని పెరట్లోకి వెళ్ళాడు. అప్పుడు సూర్యాస్తమయం అయింది; కాని యింకా చీకటిపడలేదు. తనకిబాగా మార్కులు వచ్చినసంగతి చెప్పాలెననీ, రాధమ్మకి జున్నివ్వాలనీ ఉబలాటపడుతున్నాడు. ఆమె చాలా సంతోషిస్తుందని ఊహిస్తున్నాడు.

ఈ సరదాలో, ఆమె పెరట్లో వుంటుందో లేదో అన్నసంగతి అతనికి తట్టలేదు. గ్లాసు పట్టుకొని జాగ్రత్తగా చెట్టెక్కాడు. పక్కింటి పెరట్లో అలికిడి లేదు. ఆమెను మెల్లిగా పిలుద్దామా అని ఆలోచన తట్టింది. ఒక నిర్ధారణకు రాలేకపోయాడు. చెట్టుదిగి పోదామా అనుకున్నాడు, నిరుత్సాహంతో. కాని, మార్కులసంగతి చెప్పకుండానే, ఆమెకోసం తీసుక

వచ్చిన జున్నివ్వకుండానే, వచ్చేయడం మనస్కరించడం లేదు.

చటాలున ఓ ఆలోచన తట్టింది. రాధమ్మ వాళ్ళింటివేపునుంచి గోడ అట్టే ఎత్తులేదు. సులభంగా దిగవచ్చును. ఆమెకు తెలియకుండా అట్లాదిగి, వెళ్ళి యిస్తే ఆశ్చర్యపడి పరిసంతోషిస్తుందేమో? వెంటనే, గళాసును జాగ్రత్తగా గోడమీాదనుంచి, ఆవలి పెరట్లోకి దిగి, గళాసు పట్టుకొని అతి ఉత్సాహంతో లోపలికి వెళ్లాడు.

అప్పటికి వంటయిపోయిందో లేక యింకా మొదలుపెట్టలేదోకాని, రాధమ్మ ఉత్తరమో ఏదో చదువుతూ పెరటివసారాలో కూర్చొని ఉన్నది. ఉలుకుపడి, 'ఎవరది?' అని రాధమ్మ లేవబోయేసరికి, 'నేనండీ, మా ఆవు ఈనింది, జున్ను తీసుకొచ్చాను' అన్నాడు నవ్వుతూ. ఇతని మాటలు వినిపించుకుందో లేదో, చేతిలోని గళాసేనా చూచిందోలేదో, 'నువ్వటోయి! ఎందు కిలా గోడదిగివచ్చావు? ఎవరేనా చూస్తే ఏమనుకుంటారు?' అని గబగబ అనేసింది. ఆమె కంఠస్వరంలో అణుమాత్రం కాఠిన్యమో లేక ఖచ్చితమైన స్వనమో ఉన్నట్టనిపించిందికూడా.

సత్యం మహా చిన్నపుచ్చుకున్నాడు. అమాంతంగా నిర్జీవుడైపోయినట్టు, చెప్పరాని పరాభవం జరిగి

నట్లూ అనిపించింది. బాగా మార్కులువచ్చినందుకూ, తాను జున్ను తీసుకువచ్చినందుకూ ముచ్చటపడి ఆప్యాయంగా ఏమేమో అంటుందని తీయని కలలుకన్న సత్యానికి, పాపం, నోటమాటరాకుండా అయిపోయింది. తప్పుపనిచేసిన అబ్బాయిలా సమాధానమేమీ చెప్పలేక జున్నుమాటా, మార్కులసంగతీకూడా మరచిపోయి తలవంచుకుని వెళ్ళిపోబోయాడు.

'జున్నివ్వకుండానే వెళ్ళిపోతున్నావూ, సత్యం!' అంటూ, రాధమ్మ వెంటనేలేచి అతని చేతినుండి గ్లాసందుకుంది. సత్యానికి కళ్ళనీళ్ళపర్యంతమయింది. ఆపుకోడానికి బ్రహ్మాండ ప్రయత్నమయింది. 'జున్నింట్లోవుంచి గ్లాసు తీసుకొస్తాను; రా మరి' అంటూ లోనికివెళ్ళి మరోగ్లాసులోవేసి వట్టిగ్లాసు నక్కడే కడిగి వెంటనే వచ్చింది. సత్యం పెరట్లోనే వున్నాడు. రాధమ్మ యీమారు నవ్వుతూ, 'ఇంట్లోకి రాకుండా అక్కడే నిల్చున్నావా? ఇటురా ఒక్క ఘడియ కూర్చోవూ?' అని ఆప్యాయంగా పిలిచింది. సత్యం కష్టంమీద ఆవేదననాపుకొని 'ఆలస్య మవుతూంది. ఇంక చీకటిపడుతుంది; వెళతానండీ' అన్నాడు వాల్చినచూపులతో. 'సరే, అవును పొద్దు పోతూంది. జాగ్రత్త సుమీ చెట్టుదిగడం; గ్లాసుతోకూడాను' అంటూ అతనితో గోడవద్దకు వచ్చింది. 'నువ్వు

ముందుదిగు; నేనందిస్తాను' అని గళా సతని చేతిలోంచి తీసుకుంది. సత్యం చెట్టుదిగాక, గ్లా సందిస్తూ 'కోపం వచ్చిందా, సత్యం?' అని లాలనగా అన్నట్టుంది. 'లేదండీ' అని సత్యం వెళ్ళిపోయాడు.

ఇది జరిగిన పది పన్నెండు రోజులవరకూ సత్యానికి జామిచెట్టెక్కడానికి యిదివరకటి ఉత్సాహం తగ్గి కొద్దిగా జంకుగాకూడా ఉండసాగింది. తా నేదో తెలివితక్కువపనిచేసి రాధమ్మకు వ్యథ కలిగించానని పించింది; కాని, 'జాగ్రత్తసుమీ చెట్టుదిగడం' అని ఎంత ఆప్యాయంగా అంది! 'కోపంవచ్చిందా?' అని ఎంత నెమ్మదిగా, మృదువుగా అడిగింది! కాని ఎందు చేతనో మనసుమీద ఘాతవలె యేదో అర్థంకాని యాతన పూర్తిగా పోకుండావుంది. తాను చేసిన పొరపా టేమిటో అతనికి స్పష్టంగా బోధపడ లేదు. ఇటువంటి విషయాల్లో, యింకా తెలిసీతెలియని జ్ఞానమతనిది. ఏమయినా, ఆమెకు కోపమూ, చిరాకూ కలిగించే పనేదీ యికముందు చేయరాదనుకున్నాడు.

ఆదివారమునాడు సాయంకాలం టెన్నిస్‌నుంచి కొంచెమువేగంగా వచ్చి, ఒళ్ళూ, ముఖమూ కడుక్కొని బట్టలుమార్చి, చెట్టుమీదికెక్కి చాలా రోజులయిందనిపించి పెరట్లోకి వెళ్ళాడు. ఆపలి పెరట్లోకి మాత్రము చూద్దామనీ, ఆమెకు తెలియకుండానే,

వీలైతే ఒక్కసారి ఆమెనుచూచి దిగిపోదామనీ అనుకున్నాడు. సత్యం చెట్టెక్కేటప్పటికి పూలచెట్లవారగా వంగుని గోతేల్లోవున్న గులాబీమొక్కలకు గొప్పు చేస్తూనో, నీళ్ళుపోస్తూనో, చీరెకుచ్చెళ్ళు మోకాళ్లపైకెగకట్టుకునుంది. సత్యాన్నిచూచి, లేచి చీరె సవరించుకోబోయింది. తత్‌క్షణమే ఏదో తప్పుపనిచేస్తూ పట్టుపడినవానిలా, సత్యంచెట్టుమీదనుంచి దూకినంత పనిచేసి, గబగబ ఇంట్లోకి పారిపోయాడు. తొందరగా దిగడంలో చెట్టుకొమ్మలు అతనికి గీసుకపోవడమే కాకుండా కాలు బెణికిందికూడాను. చెమటపట్టినట్లనిపించి, వళ్ళు వణకసాగింది. తనని గురించి రాధమ్మ ఏమనుకుంటుందో ? ఇక నెప్పుడూ పూర్వంవలె ఆమెను చూడలేననుకున్నాడు.

మరుగ్గావుండే ఎవరిపెరట్లో వారట్లా, బట్టకట్టు విషయంలో ప్రత్యేకశ్రద్ధ వహింపక, పనిపాటలేవో చూచుకోవడంలో విపరీతమూ లేదు; అనౌచిత్యవిషయమూ కాదు. సత్యానికిమటుకూ ఏదోపొరపాటో, అసందర్భపుపనో చేసినట్లనిపించింది. జున్నుతీసుకు వెళ్ళిననాడే స్పష్టంగా తెలియరాని అపస్వరమేదో పలికింది. ఇన్నాళ్లూరుకొని ఈరోజెందుకు చెట్టెక్కానా అని తీరనివ్యథ కలిగింది. ఏమీతోచని వానిలా తనగదిలో పక్కమీదోసారిదొర్లి దీపాల

వేళకి పుస్తకాలుతీసి చదువబోయాడు. దృష్టినిలవక లేచి అటూఇటూ తిరిగి, వంటింటిగడపవద్దకి వెళ్లాడు. వాళ్లమ్మా, అమ్మమ్మా కూడా వంటపనుల్లోనే ఉన్నారు; అమ్మ పచ్చడిచేస్తూంది; అమ్మమ్మ కూర వేపుతూంది. ఈమధ్యంత తరుచుగా అలారాకపోవటాన్ని అమ్మమ్మ, 'ఏమిరా బాబూ, యిలావచ్చావు' అని ఆపేక్షతో అంది.

"ఏంకూర చేస్తున్నావమ్మమ్మా?"

"దొండకాయముక్కలు ఎఱ్ఱగా వేపుతున్నా. వంకాయపులుసుపచ్చడి నీకిష్టమే కదూ, ఏం నాయనా, ఆకలేస్తూందా?" అంది అమ్మమ్మ.

వంటపొయ్యిలో నాట్యంచేస్తూన్న జ్వాలను పరధ్యానంగాచూస్తూ ఏవో కబుర్లుచెబుతూ కాస్సేపక్కడ కూర్చొని వెళ్ళిపోయాడు.

నాలుగైదు రోజులవరకూ సత్యానికేదో లోటు సంభవించినట్టు బెంగగావుంది. ఇక మరెప్పుడూ, మునపటిలా చనువుగా రాధమ్మతో మాట్లాడే అవకాశం లేదనుకున్నాడు. నిర్మలాకాశంలో చల్లని వెన్నెలలా గడిచిన ప్రశాంతమైన అదృష్టదినాలు మళ్లీ వస్తాయా, అని అనుకోసాగేడు.

శనివారం మధ్యాహ్నం మూడుగంటలవేళ ఒక్కడూ పెరటివసారాలో తాపీగా కాఫీతాగుతూ

కూర్చున్నాడు. జామిచెట్టు కేసి కాంసు పరధ్యానంగా, అర్థంకాని దిగులుతో, వేదనతో చూస్తున్నాడు. 'సత్యం' అని పిలిచినట్లయింది. కంఠస్వరం అతన్ని చకితుణ్ణిచేసింది. రాధమ్మేనా! అవును. చెట్టుకొమ్మల్లోంచి, గోడమీదానుకొని, కనిపించింది. రాధమ్మే తనని పిలుస్తూంది! ఆశ్చర్యం, సంభ్రమం, ఆనందం ఒక్క-సారే కలిగాయి. అయితే ఆట్టే తనమీద కోపంలేదన్నమాట! ఎంతమంచిది, ఎంతమంచిది! సిగ్గూ, సంశయమూ పూర్తిగా వదలకపోయినా, గళాసక్కపిచి గోడదగ్గరకు వెళ్లాడు' 'ఏం సత్యం, కనిపించడమే లేదేమీ?' అని మామూలుగా, పూర్వంలాగే ఆప్యాయంగా అంది. సత్యానికి ఉల్లాసం హెచ్చవుతూంది. చెట్టెక్కి యథాస్థాయిలో కొమ్మని చేరబడి కూర్చున్నాడు. కాని సరిగ్గా మాట్లాడలేక పోయాడు.

'అవాళ అల్లాగొందరగా చెట్టుమీదనుంచి దూకేశావెందుకూ? దెబ్బ తగలలేదుకదా, కొమ్మలేం గీసుకుపోలేదు కదా? ఎప్పుడూ అలా దూకకేం? నేనొస్తూనే వుంటినే, అల్లాపారిపోతూవేం?' అంది. ఈ తీయని ఆప్యాయమైన మాటలతో ఇన్నిరోజులనుంచీ మనసు నావరించిన మబ్బుతెర లొక్క-సారిగా విడిపోయాయి. మళ్ళీ నిర్మలాకాశంలో పండువెన్నెల

విరిసింది. సంభ్రమానందంలో సత్యాని కేం మాట్లా డాలో బోధపడలేదు.

'నువ్వు తెచ్చిన జున్నంత బాగుందనుకున్నావు! ...కోపం వచ్చిందా?' అంది నవ్వుతూ. సత్యానికి మళ్ళీ యివాళ కళ్ళనీళ్ళ పర్యంతం అయింది. ఆవేదన నాపుకొని, వాల్చిన దృష్టులతోనే 'మీమీద నాకెందుకు కోపం వస్తుందండీ, రాధమ్మగారూ! మీరెంతో మంచివారండీ' అన్నాడు అమాయకంగా. ఈ నిర్మల బాల్యవిశ్వాసం, స్నేహపూరిత వాక్కులూ రాధమ్మ హృదయాన్నెంత స్పందింప చేశాయో సత్యమే మెరుగును? ఎవరికిమాత్రం తెలుసును? ఆమె మటుకూ మామూలుగానే 'అప్పుడప్పుడు కనిపిస్తూండేం. టెన్నిస్ ఆడుతున్నావా?' అంది.

''అలాగేనండీ; ఆడుతున్నాను.''

''సరే; ఆటకు వేళవుతూందేమో, వెళ్ళిరా'' అని, కాస్తసేపులో వెళ్ళిపోయింది.

ఇదివరకెన్నడూ ఎరుగని సంతృప్తితో, అతి ఉల్లాసంగా చెట్టుదిగి సత్యం ఇంట్లోకి వెళ్ళాడు. ఆటలోనూ, చదువులోనూ ఇనుమడించిన సరదా, ఉత్సాహమూ కలిగాయి. అదృష్టరేఖలు పూర్వంలాగే ప్రకాశవంతముగా ప్రసరింప సాగాయి. ఒడుదుడుకు

లట్టే లేకుండా, మనోహరమైన ఈ జాంవివృత్తి స్నేహా నుబంధము దినదినమూ దృఢపడసాగింది.

ఓరోజు ప్రొద్దున్న సత్యం వంటింటివసారావేపు వెళ్ళగా, వాళ్ళమ్మమ్మ మడిపంచె, పందిరను ఆర వేస్తూ, ఆవలిపక్క గోడనానుకొని నిల్చున్న రాధ మ్మతో మాట్లాడుతూండడం చూచేడు. అమితమైన ఆశ్చర్యం వేసింది. అయితే అమ్మమ్మకు కూడా రాధమ్మతో పరిచయమున్నదన్నమాట! ఎందుచేతనో చాలా సంతోషం కలిగింది. రాధమ్మతో మరింత సన్నిహిత స్నేహపరిచయ మయినట్లనిపించింది. అతను పెరట్లో కప్పుడు వెళ్ళలేదు; కాని చూచాయగా అతని చెవుల్లోపడిన మాటలన్నోరణినిపట్టి అమ్మమ్మ రాధమ్మ తో చనువుగా మాట్లాడుతూన్నట్టే అనిపించింది. 'ఏమే, అమ్మాయ్' అనే అమ్మమ్మ రాధమ్మను సంబో ధిస్తూంది! అవాళ సాయంకాలం ఎవరూ దగ్గరలేని సమయాన సత్యం వాళ్ళమ్మమ్మవద్ద కూర్చుని మాట్లా డుతూ 'అమ్మమ్మా, నీకు పొరిగింటివాళ్ళని తెలుసునూ?' అన్నాడు.

'తెలియకేం; ఏదో చిన్నప్పుడు చూచాను, పోల్చుకోలేక పోయాను మొదట చూచినప్పుడు. ఈ మధ్యే కాపురం పెట్టారుట పొరుగింట్లో. ఈఅమ్మాయి పెత్తల్లీ మేమూ, ఇరుగూపొరుగూ, ఒక్క కుటుంబంలా

వుండేవాళ్లం, కొత్తపేటలో ఉన్నప్పుడు. అప్పుడీ రాధమ్మ ఆరేడేళ్ల పిల్ల. ఎప్పుడేనా వస్తూండేది, వాళ్లమ్మతో పెత్తల్లిగారింటికి. వాళ్ల పెత్తల్లి ఎంత మంచిమనిషి! చాలా సాయంగా వుండేదిమాకు.' అని ఏమేమో రాధమ్మగురించికంటే ఆమె పెత్తల్లిగారి కుటుంబంగురించే, పద్దెనిమిద, యిరవై ఏళ్లక్రిందటి సంగతులు, చెప్పసాగింది. రాధమ్మ పెత్తల్లి గురించిన విషయాలైనా సత్యానికి వినడానికి సరదాగానేవుంది. రాధమ్మ వాళ్ల వాళ్లనుగూర్చి మంచివాళ్లని వాళ్లమ్మమ్మ మెచ్చుకోవడం సత్యానికి మరీ సంతోషం కలిగించింది.

వాళ్ళమ్మమ్మే కాకుండా, వాళ్ళమ్మా, చెల్లెలూ కూడా పెరటిగోడవద్ద రాధమ్మతో మాట్లాడుతూండడం సత్యం ఒకటి రెండుసార్లు చూచాడు. ఓరోజు రాధమ్మ 'మా యింట్లో పువ్వులు విరియ పూస్తున్నాయి. అమ్మాయి జడలో పెట్టండి.' అంటూ వాళ్లమ్మకిన్ని గులాబీ పూలూ, మల్లెపూలగుత్తీ అందివ్వడం చూచాడు. ఆ పూలవలెనే అతని లేతమనసు కూడా వికసించింది. అయితే, వాళ్లింట్లోవారందరికీ రాధమ్మతో బాగానే పరిచయం అయిందన్నమాట! ఇరుగుపొరుగున వున్న ఆడవాళ్ళు — అందులో ఒక తరహాకు చెందినవారూ, ఒకరి కుటుంబాల స్నేకరు

కొద్దిగా ఎరిగున్నవారూ అయినప్పుడు — వీరికీ వారికీ మధ్యనున్న పెరటిగోడవద్ద పలకరించుకొని అప్పు డప్పుడు మాట్లాడుకోవడం సర్వసామాన్యం. సత్యానికి మాత్రం, ఈ స్వల్పవిషయమే ఒక స్వప్నలీలగా తోచింది. కాని, వాళ్ళింట్లోవాళ్ళతో రాధమ్మ ఎప్పు డేనా మాట్లాడుతున్నప్పుడు, తానటు వెళ్ళడం తటస్థ పడినా, రాధమ్మ ఎదటపడేవాడు కాడు; ఎందుచేతో సంకోచంగానూ, సిగ్గుగానూ వుండేది.

ఒకరోజు ప్రొద్దున్న, అవాళశెలవురోజు, యింకా భోజనాలవేళ కాలేదు, సత్యం చెట్టుమీద కూర్చుని రాధమ్మతో కబుర్లు చెబుతున్నాడు. ఎవరూ అటు రారనుకున్నారు. ఏదోపనివుండి కాంబోలు వాళ్ళమ్మమ్మ పెరట్లోకి వచ్చింది. రాధమ్మను గోడవద్దచూచి పలకరించింది. సత్యానికి అమ్మమ్మ తననిచూచి ఏమనుకుంటుందో అని చాలా తత్తరపాటు కలిగింది. రాధమ్మమటుకూ, నవ్వుతూ, మామూలుగానే, 'చూశారా, బామ్మగారూ; మీ అబ్బాయికి నేనంటే ఎంత ఆపేక్షో! జామిపండ్లిస్తూంటాడు' అనేసింది. సత్యానికి సిగ్గూ, ఆశ్చర్యమూకూడా వేశాయి. ఏదో గుప్తంగా దాచుకువస్తూన్న అదృష్టాన్నో, రహ స్యాన్నో బయటపెట్టేసిన ట్టనిపించింది. కొద్దిగా, రాధమ్మమీద కినుకకూడా కలిగింది. వాళ్ళమ్మమ్మ

ఈమాటలు విని ఏమంటుందో అని భయపడ్డాడు. కాని ఆవిడ నవ్వుతూ, ''జామిపండ్లేం చేసుకోం? మీ యింట్లో పూలలాగే ఈజామిచెట్టు తెగ కాస్తూంది' అని తాను రాధమ్మతో మాట్లాడుతూండడమునకు కొంచెమైనా ఆశ్చర్యపడక, రాధమ్మతో ఏదో పిచ్చాపాటీ చెప్ప సాగింది. ఈ సంఘటన సత్యాన్ని మొదట్లో కలవర పెట్టినా, ఏదో భారంతీరి కొత్తస్వేచ్ఛ వచ్చినట్టుకూడా మెల్ల మెల్లగా అనిపించింది. రాధమ్మ అట్లా జామి పండ్లగురించి అన్నందుకు తాతాత్కాలికనుకపోయి మరింత చనువేర్పడినట్లయింది.

పరీక్షలు సమీపించాయి. మొదటి సంవత్సరం కనుక క్లాసుపరీక్షలే కాని, బాగాపేసవాలనే ఉత్సాహంతో చదువసాగేడు సత్యం. రాధమ్మకూడా శ్రద్ధగా చదువుతూన్న సంగతివిని సంతోషించేది. పరీక్షలారంభమైనాక, ఎలారాశాడో ప్రతిసాయం కాలం రాధమ్మకి చెప్పేవాడు. ఆమె ఆసక్తితో సర దాగా వినడం రెండోరోజు పరీక్షకు మరింత ఉత్సాహ పరిచేది. ఆశించినట్లుగానే, అన్నిట్లోనూ సంతృప్తి కరంగా వ్రాశాడు. పరీక్షలయిపోయిననాటి సాయం కాలం తీరికగా, మరింత ఉల్లాసంగా కబుర్లు చెప్పు కున్నారు.

సత్యం, కాలేజీ లైబ్రరీనుంచి సెలవల్లో చదవ

డానికి పుస్తకాలు తీసుకవచ్చాడు. అవి తీరికగా చదువుకుంటూ, రాధమ్మని రోజూ కలుసుకుంటూ సెల వులు సరదాగా గడపవచ్చునని ఊహించాడు. అను కున్నట్టుగానే, హాయిగా గడిచి పోతున్నాయి సెలవు రోజులు. అప్పుడప్పుడు చెల్లెలికి పాఠాలు చెప్తూండే వాడు. బుద్ధిపుట్టినప్పుడు, చెల్లెలితో కేరమ్సో, రింగ్ టెన్నిస్సో కూడా ఆడుతూండేవాడు. బాలికల దేహ పరిశ్రమకు బాగుంటుందని ఒక స్కిప్పింగ్ రోప్ కూడా తీసుకవచ్చాడు. పొద్దున్నే లేచి, కసరత్తు చేసి స్నానం చెయ్యడం అప్రయత్నంగానే అలవాటయింది. సాయం కాలం ఆటకో, షికారుగా తిరిగి రావడానికో వెడు తుండేవాడు. శుభ్రంగా దుస్తు లేసుకొని, నీటుగా తయారవడంలో పూర్వంకంటె శ్రద్ధ హెచ్చయింది. యింటిపనులూ, బజారుపనులూ ఏమేనావుంటే అడిగి కనుక్కొని మరీ చేసేవాడు.

సత్యంలో వచ్చిన మార్పులను వాళ్ళ పెద్దవాళ్లు కూడా కొద్దిగా గమనింపక పోలేదు. బాగా ఎదుగుతు న్నాడనీ, పెద్దమనిషితరహాగా మారుతున్నాడనీ సంబరపడ్డారు. ఓసారి, వాళ్ళనాన్నగారు, 'మనవాడి సందడేంలేదేం?' అని వాళ్ళమ్మతో అంటూండడం, వాళ్ళమ్మ, 'మనవాడికి బాగా పెద్దమనిషితరహా అబ్బిందండోయ్, ఈమధ్య. వాడి చదువేమో,

కసరత్తేమో, పూర్వంలాగాదు. అమ్మాయికి కూడా పాఠాలు చెబుతున్నాడు. ఎంతఓపిక వచ్చిందనుకున్నారు!' అని ఏమేమో సంతోషంగా మాట్లాడుకోవడం విన్నాడు. కొంచెం సిగ్గువేసింది. సత్యానికి వాళ్ళనాన్నగారివద్ద చనువూ, భయభక్తులూకూడా వున్నాయి. భోజనాలప్పుడుతప్ప, తీరికగా వాళ్ళనాన్నగారితో కూర్చుని మాట్లాడడంమటుకూ అంతగా అలవాటులేదు. పై సంభాషణ విన్నతరువాత మాత్రం, రాత్రి భోజనాలయ్యాక వాళ్ళనాన్నగారెప్పుడేనా తీరికగా పడకకుర్చీలో విశ్రమించి, చాపమీద కూర్చున్న వాళ్ళమ్మా, చెల్లెలితో మాట్లాడుతూంటే తను కూడా వెళ్ళి, ఏమీ మాట్లాడకపోయినా, కూర్చునేవాడు. వాళ్ళ నాన్నగారు కాస్త మితభాషి. ఇంటి సంగతులూ, మామూలు విషయాలూ కొద్దిసేపు మాట్లాడి పత్రిక చదువుకునేవారు, తీరికసమయాల్లో.

ఓరోజు మధ్యాహ్నమప్పుడు, ఎండగావున్నా చెట్లకొమ్మల్లో చల్లగానే గాలి వీస్తూంది. ఎప్పటిలాగే సత్యం కొమ్మను చేరబడి, చెట్టు నీడల్లో రాధమ్మ గోడనానుకొని నిలబడి, కబుర్లు చెప్పుకుంటున్నారు. తాను సగం చదివిన తెలుగు పుస్తకాన్ని పట్టుకునే ఆమె అక్కడ నిల్చుంది. 'మీరు కథలపుస్తకాలు బాగా చదువుతూండేట్లుందే' అన్నాడు సత్యం. ఆమె నవ్వి,

'ఏదో తీరికఉన్నప్పుడు కాలక్షేపం' అంది. చటాలున జ్ఞాపకంవచ్చి, అడిగాడు. 'అన్నట్టు మీరేనండీ మొన్న హార్మోనియం వాయిస్తూంటేరి ?'

"అవును, నువ్వెప్పుడు విన్నావు ? ఎప్పుడో కాని ఈమధ్య వాయించడమే లేదు."

"అదే పాటండీ ? చాలాబాగుంది."

"ఎప్పుడో నేర్చుకున్న బెంగాలీగీతం, 'ధీరె ధీరె యమునాతీరె'."

"నాకు రాసి యివ్వరూ ?"

"ఏం, అంత బాగుందా ? పాటంటే సరదా వుందీ" నవ్వుతూ అంది.

సత్యం కూడా నవ్వుతూ, 'మరి నాకు నేర్పుతారా ?' అన్నాడు.

"మీ యింట్లో అంతా ఏంచేస్తున్నారు ?"

"చెల్లాయి ఏదో రాసుకుంటూంది, మిగిలిన వాళ్ళు పడుకున్నట్టున్నారండి."

"నీకోసం ఎవరూ వెతకోరు కదా, కాస్త ఆలస్యం అయితే ?" తిరిగి నవ్వుతూ అడిగింది.

"అబ్బే లేదండీ."

"అయితే కాస్సేపు ఇంట్లో కూచుందాం, రా మరి, పాట వినిపిస్తాను."

సత్యాన్ని వాళ్ళింట్లోకి రమ్మని యిదివర

కెప్పుడూ ఆమె పిలవలేదు. అదే మొదటిసారి. సత్యం ఆశ్చర్యానందాలతో రాధమ్మతోకూడా వాళ్ళింట్లోకి వెళ్ళాడు.

ఇల్లు చిన్నదేకాని శుభ్రంగాఉంది. రెండు మూడు గదులూ, వంటిల్లు మాత్రమే. రాధమ్మ హార్మోనియంతీసి పక్కమీద పెట్టింది. సత్యం చాపమీద కూర్చోబోయాడు. 'మొహమాట పడుతున్నావా, సత్యం? దా, యిలాకూచో' అని మంచంమీదనే కూర్చోమంది. సత్యాన్ని సంగీతంపెట్టె నొక్కమని, ఆపాటవాయిస్తూ మెల్లనిస్వరంలో పాడింది. ఎంత హాయిగావుంది ఆగీతం! ఎంత విన్నా వినాలనేవుంది. ఆమె వాయిస్తూ పాడుతూ, తాను పెట్టె నొక్కుతూ వింటూంటే మరింత హాయిగావుంది.

తరువాత పాట వ్రాసి యిచ్చింది. కొంచెం సేపుండి సత్యం వెడతానన్నాడు. 'ఉండుమరి; కాఫీ తాగి వెళుదువుగాని' అంటూ కాఫీ కలప మొదలు పెట్టింది. సత్యం ఊరికినే కూర్చోక, కప్పులూ, అవీ అందిస్తూ చిన్నపను లామెతోకలిసి చేయసాగేడు. 'మధ్యాహ్నం వేసిన పెసరట్టుంది, కాస్త పుచ్చుకుంటావా' అంటూ, రెండు పెసరట్లుకూడా ఫలహారం పెట్టింది. 'మరి మీరుకూడా పుచ్చుకోరూ?' అన్నాడు సత్యం. 'ఆలాగే' అంటూ, ఆమెకూడా ఓముక్క

నోట్లో వేసుకుంది. ఫలహారం అయాక యిద్దరూ కాఫీ పుచ్చుకున్నారు. 'మాయింట్లో కాఫీకంటే మీ యింట్లో బాగుంటుందండీ' అన్నాడు, సత్యం. ఆమె నవ్వి, ఊరుకుంది.

"సెలవల్లో వస్తూంటాను; మరి నాకు పాట నేర్పుతారా?"

'అన్నట్టు, చెప్పడం మరిచిపోయాను సత్యం; మావారు యిల్లు మార్చేద్దామనుకుంటున్నారు; మరో యిల్లు చూశారుట.' ఇది వినేసరికి సత్యం గుండెల్లో పెద్ద రాయి పడినట్టయింది. ఏదో పెద్ద పెన్నిధి పోగొట్టుకొన్నవాడిలా నోట మాటరాకుండాపోయింది. కాని, తమాయించుకొని 'ఎందుకు మార్చేస్తారూ?' అన్నాడు.

"ప్లీడరుగారింటికి దగ్గరలో ఓయిల్లు ఖాళీ అయిందట."

"ఎప్పుడు వెళదామనుకుంటున్నారండీ?"

"ఇంకా ఏదీ నిశ్చయించినట్టు లేదు కాని, మంచి రోజు చూసి వెడదామనుకుంటున్నట్టుంది."

సత్యానికి ఎంత ప్రయత్నించినా వశంకాక, దిగులు పెరగసాగింది. మనసు ఒక్కసారిగా ఆందోళనలో పడిపోయింది. అంతెరుగని మధురస్వప్నం అకస్మాత్తుగా హరించిపోతూన్నట్లనిపించింది. కలచి

వేస్తూన్న ఆ వేదన నతనెంత పైకి కనబడకుండా ఉండేట్టు ప్రయత్నించినా అతని అమాయకపు బాల్య ముఖంమటుకూ ప్రతిఫలిస్తూనేఉంది. ఇక ఉద్వేగాన్ని నిగ్రహించుకోవడం కష్టమనిపించి, 'వెళతానండీ' అని లేచాడు.

'అప్పుడే వెళ్లిపోతావా? ఇదిగో, యిల్లంతా త్వరలో మార్చవద్దని చెబుతాలే' అని ఆప్యాయంగా అతని చేయి పట్టుకొని అంది. ఆ ఆప్యాయతకు మామూలుస్థితిలో సత్యం ఎంతేనా సంతోషించేవాడు, కాని యిప్పుడతని మనసులో రాధమ్మ వెళ్లిపోతుందనే దిగులుతప్ప మనోభావనకుగాని, తలంపుకుగాని చోటు లేదు.

''ఇంట్లో నాకోసం చూస్తూంటారేమోనండీ. వస్తాను'' అన్నాడు ఎప్పటి ఉల్లాసమూ లేని స్వరంతో.

'రేపు తప్పకుండా కనిపిస్తావా? మరిచిపోకేం?' అంటూ హెచ్చరికగా అతనిని గోడవద్దకువచ్చి సాగనంపింది.

సత్యం చెట్టుదిగి గబగబా యింట్లోనుండి మేడమీద తన గదిలోకి వెళ్లిపోయాడు. అతనట్లా తొందరగా నట్టింట్లోంచి వెళ్లిపోవడంచూచి, వాళ్లమ్మమ్మ 'ఏమిరా ఎక్కడున్నావు? మీ అమ్మ అట్లుపోస్తూంది. తింటువుగాని రా నాయనా' అంది. సత్యం, ఆగ

కుండానే, ఆకలి లేదంటూ వెళ్ళిపోయాడు. తిన్నగా వెళ్ళి పక్కమీద తలగడలో ముఖంపెట్టి పడుకున్నాడు.

రాధమ్మ వెళ్ళిపోతూంది! ఈ తలపు ఎంత ప్రయత్నించినా మనసును కలతపరచడం మానడంలేదు. అంతేనా, సరదాగా జాబిచెట్టుక్కి ఎప్పటిలాగా మాట్లాడుకోవడం ఉండదా? తన కోర్కెలూ, ఆశయాలూ ఎవరితో చెప్పుకోవడం? ఇంకా ఆశయాలూ, కోర్కెలు ఏమిటి! ప్రకృతి సహజంగా అల్లుకొన్న లత లాగా ఈ జాబిస్నేహ సన్నివేశానుబంధం తన జీవితాన్నల్లుకొంది. జీవితంలో భాగమే అయింది. ఏ హృదయంలేని విధివల్లనో ఇంత క్రూరంగా త్రెంచబడుతూంది. రాధమ్మ ఎప్పుడూ అక్కడే ఉంటుందనుకున్నాడు. మరోయింటికి వెళ్లిపోవచ్చు ననేవిషయం ఎప్పుడూ తట్టలేదు. ఇంతత్వరలో యిల్లు మార్చక పోవచ్చునని చెప్పించరాదూ? అయి తేమటు కేమి లాభం? ఎప్పుడేనా వెళ్ళిపోతుందిగా!

అనుకోకుండానే కళ్ళవెంబడి నీళ్ళు ధారనాగేయి. ఆపుకోడాని కతను ప్రయత్నించలేదు. ఇంతలోకే వాళ్ళమ్మ అట్లూ, కాఫీ తీసుకొని గదిలోకొచ్చింది. 'ఏమిరా, పండుకున్నావేమీ? అట్టుముక్క తిందువుగాని, లే నాయనా; వేడివేడిగ తెచ్చాను; లేమరి' అంది. సత్యం మాట్లాడలేదు; మాట్లాడలేకపోయాడు. వా

ళ్ళమ్మ కాఫీ, ఫలహారం బల్లమీద పెట్టి, సత్యంవద్దకు వెళ్లి బుగ్గమీద చెయ్యివేసి చూచింది. జ్వరమున్నట్టు లేదు. కాని మామూలు చురుకుతనంలేక ఏదో బాధతో పడుకున్నాడని తెలుసుకున్నది. అక్కడే కూర్చొని, ఆపేక్షతో వళ్ళు నిమురుతూ, 'వొంట్లో ఎలాగుంది బాబూ?' అంది.

ఈ ఆప్యాయతకు సత్యందుఃఖం ఆగిందికాదు. చిన్నపిల్లవాడిలా వాళ్ళమ్మదగ్గిరగా జరిగి, కన్నీరు తిరుగకార్చాడు. దానితో భారంతగ్గింది. వాళ్ళమ్మ కంగారుపడి, 'ఎలాఉంది నాయనా, నాతో చెప్పమరి' అంది. సత్యం సద్దుకుని, కుదుటబడి సిగ్గుతో 'ఏమీ లేదే, ఊరికినే' అని ఊరుకున్నాడు. 'కొంచెం కాఫీతాగు, సుళువుగా ఉంటుంది' అని కాఫీ తీసుకు వచ్చింది. వాళ్ళమ్మ తీసుకువచ్చిందికదా అని తాగేడు. తరువాత వాళ్ళమ్మ లేస్తూంటే 'కూర్చోవే' అన్నాడు. 'అలాగే, ఎక్కడికీ వెళ్ళనులే. పక్క సరిగ్గాలేదు; దుప్పటీ తలగడా సద్దుదామనీ; ఇక పడుకో' అని అక్కడే కూర్చుంది.

ఇంతలోకే వాళ్ళమ్మని బిగ్గరగా పిలుస్తూ, చెల్లెమ్మ వచ్చిందక్కడికి. 'కేకలు వెయ్యకు; అన్నయ్యకు వొంట్లో బాగులేదు' అంది వాళ్ళమ్మ. చెల్లెమ్మ నిశ్శబ్దంగా చూస్తూ వాళ్ళమ్మవద్దకొచ్చి నిలబడింది,

మరికొంచెంసేపులోనే 'బాబుకెలాఉందే' అంటూ అమ్మమ్మకూడా వచ్చింది. సత్యం అప్పటికే తేరుకొని కాస్త మొహమాటంతో నవ్వుతూ కూర్చున్నాడు. 'పరీక్షలకి బాగా చదివాడా; బడలిక చేసిందేమో' అంది అమ్మమ్మ. కాస్తసేపు కూచొని వాళ్ళ పనుల్లోకి వెళ్ళబోయారు. 'నువేమీ లేదే' అంటూ సత్యం వాళ్ళమ్మను కూడా పనిచూచుకోమన్నాడు.

ఒక్క ఘడియ కూర్చొని, సత్యం లేనిఉల్లాసం తెచ్చుకొని, టెన్నిస్‌కికాని, అలా షికారుగాకాని వెళ్ళివద్దామని ముఖం కడుక్కోడానికి వెళ్ళాడు. ముఖం కడుక్కొని తువాలుతో తుడుచుకుంటూనే, చూసుకోకుండా, గబగబ రావడంలో, గడప కాలికితగిలి పడ్డాడు. చేతులపై ఆనుకోడంవల్ల ముఖానికి దెబ్బ తగలలేదు కాని గడపకింరిఘడియ కాలుకి తగిలి గీసుకపోయి రక్తం వచ్చింది. కాలూ, చేయీ బాగా మోసి ఒక్కక్షణం లేవభారమైంది.

చెల్లెమ్మ యిది చూచి 'అమ్మా, అన్నయ్య పడిపోయాడే' అంటూ కేకేసింది. సత్యం తడబడుతూ లేవబోయాడు. కంగారుతో వాళ్ళమ్మా, అమ్మమ్మా వచ్చారు. సత్యం మామూలుగా నడవ ప్రయత్నించాడు, కాని యిరుకుపట్టి కాలు బాగా నొప్పిచేసినందువల్ల కుంటవలసివచ్చింది. వాళ్ళమ్మా, అమ్మ

మూర్తి గాభరాపడి, 'నీరసంగా ఎందుకు లేవావు నాయనా, ఎవర్నైనా పిలవమంటావా' అంటూ నెత్తురు తుడిచి పట్టువేద్దామనుకుంటూ ఉంటే, సత్యం చెల్లాయిని శుభ్రమైన గుడ్డపీలిక తీసుకురమ్మని, దానితో అతనే గాయాన్ని కట్టు కట్టుకుంటూ, 'మరేం అట్టే దెబ్బతగల లేదు; నీరసమేమీ లేదు. టెన్నిస్‌కి వెళ్తే నామని ముఖం కనుక్కొని వస్తూ, గడప తగిలింది' అన్నాడు. 'వొంట్లో బాగులేదని పడుకొని, టెన్నిస్ ఏమిటిరా' అంటూ, సత్యం వద్దంటున్నా వినిపించుకోక వాళ్ళమ్మ చేయిపట్టు కొని నడిపించుకొనివెళ్ళి, మేడమెట్లెక్కి-పద్దని చెప్పి, నడిచానట్లో మంచం, పక్క వేసి పడుకోపెట్టింది.

సత్యం మవ్వానా, అవీ అక్కడికే తెప్పించుకొని మస్తుబు మూర్చి, తల దువ్వుకొని పాత వారపత్రికలు-ఇంగ్లీషువీ, తెలుగువీ కూడా — చెల్లెలిని తెమ్మని, అవి చదువుతూ పడుకున్నాడు. మరికాస్త సేపటికి వాళ్ళ నాన్నగారు వచ్చారు. సత్యాన్ని చూస్తూనే 'ఏమిరా, పడుకున్నావేమీ?' అంటూ వొంటిమీద చెయ్యివేసి చూచారు. వాళ్ళమ్మ, అమ్మమ్మావచ్చి ఆతృతతో చెప్పసాగేరు. సత్యానికి ఏదో చాదస్తంగా చెబుతున్నట్టనిపించింది. సిగ్గుకూడా వేసింది. ఇంకా సిగ్గుతో తత్తరపడుతూ 'ఒంట్లో ఏమీలేదు నాన్నా' అని సత్యం అన్నా వాళ్ళ నాన్నగారు ఫలహారం, కాఫీ

పుచ్చుకుని, 'అటువేపే వెళ్తున్నాను. డాక్టరు గారిని ఓసారి రమ్మంటాను' అని సత్యంవాళ్లమ్మతో చెబుతూ లేచాడు.

౨

రాధమ్మ కింకా యిరవై ఏడు యిరవై ఎనిమి దేళ్ళలోపే. నరసాపురం దగ్గరలోనే ఆమెస్వగ్రామం. ఆమె కాపురానికివచ్చి ఎనిమిద తొమ్మిదే ళ్లవుతుంది. ఆమెభర్త, జగన్నాధంగారి కామె కాపురానికివచ్చిన నాటికే నలభై ఏళ్లు దాటినై. ఆమెభర్తవలెనే ఆమె కూడా సామాన్యకుటుంబానికి చెందినది, కాస్త చదువుకున్నదీ, సంస్కారం ఉన్నదిన్నీ. వయసులో బాగా తేడాఉన్నా రెండోపెళ్లి సంబంధం రాధమ్మకి చేయడానికి ఆమె తలిదండ్రులు మొదట్లో ఇష్టపడ లేదు. కాని, అనుకూలమైన ఇతరసంబంధాలు కుదరక అప్పటి పరిస్థితులనుపట్టి జగన్నాధంగారికిచ్చి పెండ్లి చేశారు.

అప్పటికే జగన్నాధంగారు పంతులుగారింట ప్లీడరుగుమాస్తాగా చేరి ఇంచుమించు ఇరవై ఏళ్లయింది. జగన్నాధంగారు ప్లీడరుగారి కుటుంబంలోనివారిలాగానే మసలేవారు. గృహవిషయాల్లో పాల్గొనడమే కాకుండా, పంతులుగారింట ఏ కార్యమొచ్చినా పెత్తనమంతా

ఈయనమీదే వేసేవారు. ప్లీడరుగారి కుటుంబంఎడల జగన్నాథంగారి కెంత గౌరవ విశ్వాసాలో, ఆయన యందు పంతులుగారి కుటుంబానికి కూడా అంత అభిమానమే. జగన్నాథంగారు మంచివారూ, నిజాయితీపరులున్నూ. తోడి గుమాస్తాలలో నేకాక, ప్లీడర్లలోనూ కచేరీల్లోనూ కూడా ఆయనకు మంచిపేరూ, గౌరవమూ ఉన్నవి. పాతకాలపువారైనా, మంచి అనుభవమూ, వ్యవహారజ్ఞానమూ కలవారు.

స్నానమూ, కాఫీ ముగించుకొని పొద్దున్నే ప్లీడరుగారింటికి వెళ్లేవారు. భోజనానికి ఇంటికివచ్చి మళ్ళీ రాత్రి భోజనానికే ఇంటికిరావడం సాధారణంగా ఆయన కలవాటు. ఇంచుమించు దినమంతా ప్లీడరుగారింట్లోనూ, కచేరీలోను గడిపేవారు. మధ్యాహ్నం కాఫీ ప్లీడరుగారితోనే పుచ్చుకునేవారు. అప్పుడప్పుడు పంతులుగారింట్లోనే ఫలహారం, ఎప్పుడేనా భోజనం కూడా చేసేవారు. తీరికసమయాల్లో ప్లీడరుగారి తల్లి, భార్య మొదలైన ఆడంగులకు పురాణగ్రంథ మేదేనా చదివి వినిపించడంకూడా అలవాటు. ఆయన బాగా చదివి చెబుతారు. అందుచేతనూ, చనువుచేతనూ ఆయన పురాణకాలక్షేపమంటే ప్లీడరుగారింట్లోనివారందరికీ చాలా సరదా. ఎప్పుడేనా, అరుదుగా పంతులుగారు కూడా వచ్చి కూర్చుని వినేవారు.

పంతులుగారింట గుమాస్తాగాచేరి దాదాపు ముప్పై సంవత్సరాలు కావస్తున్నా, పనిలో ఓపికా, చురుకుతనమూ ఏమాత్రమూ తగ్గలేదు. కాని, ప్లీడరు గారి ప్రేక్టీసు బాగా పెరగడంచేత ఈమధ్య మరో గుమాస్తానుకూడా వేసుకున్నారు. అప్పటినుంచీ జగన్నాథంగారిది పెద్దగుమాస్తాహోదా. అయితే, పని అట్టేవున్నా లేకపోయినా, సెలవురోజుల్లో కూడా, ప్లీడరుగారింటికి వెళ్లకపోతే ఆయనకు తోచదు. అసలేరోజైనా ఆయన రాకపోతే పంతులుగా రింటివారికే వెలితిగా తోచేది.

ఆయన జీతం ఎంతైనా, నెలకో వందకు తగ్గకుండా వుంటుంది ఆర్జన. కొద్దోగొప్పో నిలవేశారు కూడాను. ఏ కారణంచేతనో ఇల్లు కొనడంకాని, కట్టించడంకాని తలపెట్టలేదు కాని రెండెకరాల మాగాణి కొన్నారు.

జగన్నాథంగారి మొదటిభార్య, లేక లేక, ఒక బిడ్డను కన్నది. తుదకాయనకు భార్యా, బిడ్డాకూడా దక్కకుండాపోయారు. మొదటిభార్య పోయిన ఒక సంవత్సరంవరకూ ఆయన పెళ్ళివిషయం తలపెట్టలేదు. అప్పటికాయన వృద్ధురాలైన తల్లి జీవించేవుంది. ఆమెకితరసంతానం లేకపోవడంవల్ల వివాహవిషయం తరచూ తెస్తూండేది. జగన్నాథంగారు ప్రోత్సాహమూ

చూపక, వద్దని ఖచ్చితముగానూ చెప్పక, ముభావంగా ఊరుకునేవారు. చూచి, చూచి తుదకాయనతల్లే రాధమ్మ సంబంధం నిశ్చయించింది. వివాహమైన రెండు సంవత్సరాల లోపునే జగన్నాథంగారితల్లి గతించింది. ఇప్పు డాయనకు భార్యతప్ప వస్తూ పోతూండే దగ్గరబంధువు లెవరూ లేరు.

కాపురానికి వచ్చిన మూడు నాల్గేళ్ల తరువాత రాధమ్మ గర్భవతి అయింది. కాని, నెలలు నిండ కుండానే పురుడువచ్చి బిడ్డ పోయింది. రాధమ్మ జబ్బు పడి క్రమంగా కోలుకుంది. రాధమ్మ భర్త, తన స్థితి సంపదలనుపట్టి, ఆమె కెందులోనూ లోటు రానిచ్చే వారు కాదు. నగ, నాణ్యం, చీరె వగైరావిషయాల్లో ఆమె కేలోపమూ లేదు. ఆమెపేర మూడువేలకు భీమా చేశారుకూడాను. ఆమెఎడల అనురాగమే కాకుండా, సానుభూతీ, సౌమ్యతా కనపరిచేవారు. ఆయన, స్వభావంచేత, అసూయ, అనవసర అను మానాలూ ఆట్టే లేనిమనిషి. రాధమ్మకుకూడా ఆయన ఎడల విశేషాభిమానమూ, గౌరవమూ ఉన్నవి. ఆయన సౌకర్యాలు, కొద్దిపాటివే అయినా, చక్కగా కనుక్కుంటూండేది.

జగన్నాథంగారు నెమ్మదైనవారే, కాని, మూడు నాలుగేళ్ళక్రితం ఏదో మాటపట్టింపువచ్చి,

అత్తవారింటికి వెళ్ళడం మానేశారు. భార్యనుమటుకూ ఎప్పుడూ వెళ్ళవద్దని శాసించలేదు. అంతేకాదు; రాధమ్మ పినతల్లికొడుకు, మూర్తి — అతనికి రాధమ్మ వద్ద చిన్నప్పటినుంచీ చనువు — ఒకటి రెండుసార్లు వచ్చినప్పుడు, అతనితో కలిసి పుట్టింటికివెళితే తన అభ్యంతరం లేనట్టుగా సూచించారుకూడాను. కాని రాధమ్మే, భర్త యందలి అభిమానంచేత వెళ్ళ మానుకుంది.

రాధమ్మ ఇంటిపనులు చేసుకునో, పూల మొక్కలు చూసుకుంటూనో, ఎప్పుడేనా హోర్మ నియం వాయిస్తూనో కాలక్షేపంచేసేది. ఆమెకు కొత్త వచ్చినవారితోనేతప్ప ప్రతి ఇరుగుపొరుగువారితోనూ కబుర్లుచెప్పడం ఇష్టంలేదు. అంతగా తోచకపోతే తెలుగుకథలపత్రిక లేవేనా చదువుకునేది. పంతులుగా రింటినుంచీ, ఒకొక్కప్పుడు బజారునుంచీకూడా, ఆమెకోసం జగన్నాథంగారు కథల పత్రికలు తరుచు గానే తెచ్చేవారు. ఆయనకు కథలు చదవడానికి తీరుబడేలేదు; సరదాలేదు. ఎప్పుడేనా ఉల్లాసంగా ఉన్నప్పుడు, ఖారామసాలా కిల్లీ వేసుకొని, పద్యమో శ్లోకమో కొత్త నాటకకత్తులో విసిరి పాడడం ఆయనకు సరదా. చిన్నప్పుడు బాగా నాటకాలసరదా ఉండేద టాయనకు. ఇప్పటికీ పోలేదు, సినీమాసరదా అట్టే

కలగలేదు కాని, అప్పుడప్పుడూ, రాధమ్మకోసం మటుకూ, ఆమెను తీసుకొని సినీమాకు వెళ్ళేవారు.

ఈ విధంగా, పిల్లలులేని కొరత తప్ప, మరో ఒడుదుడుకు లంతగా లేక సాఫీగాపోతూన్న రాధమ్మ జీవితంలో సత్యంతో పరిచయం అయ్యాక ఒక కొత్త ఉత్సాహమూ, మార్పూ కలిగాయి. మొదటిసారి సత్యాన్ని చూచినప్పుడే ఆరోగ్యంగా ఎదుగుతూన్న ఆ అమాయకపు అబ్బాయితీరు ఆమెను ఆకర్షించిన మాట వాస్తవం. సత్యాని కామెయందు పెరుగుతూన్న బాల్య విశ్వాసం ఆమె హృదయాన్ని స్పందింపచేసినమాట యదార్థమే. సత్యంయొక్క సహజ నిర్మలనైజమూ, చురుకుతనమూ, ఆమె స్నేహపరిచయమంటే ఉల్లాసమూ తెలుసుకొని ముచ్చటపడ్డది.

దినదినమూ దృఢపడసాగిన ఈస్నేహపరిచయం ఆమెకుకూడా మధుర స్వప్నంలాగే ఒక్కొక్కప్పుడు తోచేది. సత్యాన్ని కలుసుకొని మాట్లాడడమంటే ఆమెకుకూడా ఉత్సాహంగానే వుండేది. పైకిమాత్రం అట్టే కనపరచేదికాదు. సత్యం ఎడల ఆమెకు క్రమేణా కలిగిన అనురాగబంధం ఇదమిద్ధమని చిత్రించడం కష్టసాధ్యం. వారి స్నేహానురాగంలో లేత్రాయమైన ప్రణయరేఖలు లీలప్రాయంగా ప్రస్ఫుటంగా తెలియరాకుండానే దాగి ఉంటే ఉండవచ్చు; కాని, వారి

స్నేహానుబంధంలో కల్మష చిహ్నం కాని, అపశ్రుతి దోషం గాని ప్రవేశించలేదనే చెప్పవచ్చును.

తన సంసారంలో ముఖ్యంగా సత్యంజీవితంలో ఏవిధమైన హానికాని, ఘాతకాని కలగడ మెంతమాత్రమూ ఆమె కిష్టంలేదు; ఓర్చుకోలేదు కూడాను. సత్యం శ్రద్ధగా చదువుతూ, టెన్నిస్ ఆడుతూ, చురుకుగా పెరుగుతూండడం ఆమెకెంతో సంతోషమూ, సంతృప్తీ కలిగించాయి. సత్యం ప్రయోజకుడై వృద్ధిలోకి రావడం — ఆమె జీవితంలో అస్పష్టమైన ఆశయం—నెఱవేరేటట్లు ఎందుచేతో అనిపించేది. అందుకు తన స్నేహపరిచయం కూడా ప్రోత్సాహమిస్తే ఆమెకదెంత గర్వకారణం! అతి ఆమాయకంగా, ఉత్సాహంగా అన్నిసంగతులూ తనతో చెబుతాడు; తాను ఆసక్తితో వింటే ఎంతో సంతోషిస్తాడు. తనమాటంటే ఎంతగురి! ఆమె గమనించకపోలేదు. 'బాగా చదువుతున్నావా' అని అడిగినంతమాత్రాన ఎంతశ్రద్ధ కలిగింది! ఇంతకూ తానేమంత చదువుకున్నదా? తనలో విశేషమేమున్నదనీ?

జున్ను తీసుకువచ్చిననాడే సత్యం చాలా చిన్న పుచ్చుకున్నాడని ఆమె ఎంతో నొచ్చుకుంది. తరువాత, ఆమె పూలమొక్కలను చూచుకుంటున్న రోజున, సత్యం మొహమాటపడి తొందరగా పారిపోవడం ఆమె

కస్పష్టమైన ఆందోళనా, ఆశ్చర్యమూ కలిగించాయి. కాని. ఈ సంఘటనలన్నీ ఆమెను సత్యంవేపే మరింత ఆకర్షించాయి. తన పాటంటే సత్యానికెంత ఇష్టం! ఇల్లు మార్చే ఉద్దేశం తెలిసి ఎంత దిగులుపడినట్టుగా అయిపోయాడు! సత్యం లేతమనసు కేకముందెప్పుడూ నొప్పి కలిగించకూడ దనుకుంది.

అసలు ఇల్లు మార్చడం రాధమ్మకీ యిష్టం లేదు. ఈ యింటికివచ్చి సంవత్సరమేనా అయిందో లేదో. మంచి పెరడూ, అదీ ఇల్లు సదుపాయంగానే వుంది. అది కాక, సత్యంవాళ్ళింట వారితో అయిన పరిచయాన్ని పట్టి మంచి ఇరుగూ పొరుగూ అని సహజంగా అని పించడమే కాక, సత్యంతో స్నేహపరిచయం ప్రత్యేక ఆకర్షణ కాదా? అయితే, ప్లీడరుగారింటికి బాగా దగ్గరలో ఓయిల్లు ఖాళీ అయినసంగతి గతరాత్రి ఆమె భర్త చెప్పినప్పుడు ఆమె ముభావంగా ఊరుకుంది. సత్యం అభివృద్ధీ, శ్రేయస్సూ అన్నివిధాలా ఆమె కోరడంచేత ఇల్లు మార్చడమే మంచిదేమో అని క్షణ కాలం చూచాయగా తట్టింది. సత్యం ముఖంలో దిగులు చూచాక ఇల్లు మార్చవద్దనే భర్తతో చెప్ప నిశ్చ యించుకుంది.

ఆవాళరాత్రి భోజనంచేసి విశ్రాంతిగా జగ న్నాథంగారు పడక కుర్చీలో నడుంవాల్చి పడుకున్న

ప్పుడు ఖారామసాలా వేసిన తాంబూలమందిస్తూ, 'ఇల్లు మార్చడ మంతఅవసరమంటారా? ఈ యిల్లు, పెరడూ అదీ సదుపాయంగానే ఉంది. ప్లీడరుగారింటికి మరీ దూరమనిపిస్తే చెప్పలేనుకాని' అంటూ ఇంటి ప్రస్తావన తెచ్చింది. జగన్నాథంగారు తాంబూలం నములుతూ, చిరునవ్వు నవ్వి. 'అబ్బే, తెలిసిన ఆతను పంతులుగారింటి సమీపంలో ఇల్లు ఖాళీగావుందని చెబితే చూశాను. ఈ యింటికున్న పాటి పెరడూ లేదు; ఇంతకన్నా హెచ్చు సదుపాయమూ లేదు. ఒక్కడ నాకు బాగానే వుంటె ఇక్కడే వుందాం. పంతులుగారింటికి ఇదిమాత్రమెంతదూరమని' అన్నారు.

''మాటకాని ఇవ్వలేదుకదా!'' అడిగిందామె.

''మాటేమిటి? అసలు వ్యవహారరీత్యా ఏమీ మాట్లాడుకోలేదే. మళ్ళీ అతను కనిపిస్తే, మాకే ఉద్దేశం లేదనీ, ఈ యిల్లు సదుపాయంగానే వుందనీ చెప్పేస్తాను'' అన్నారు.

జగన్నాథంగారికీ రాధమ్మకూ అభిప్రాయభేదాలంటూ సామాన్యంగా లేవు. జగన్నాథంగారు ఆమె అభిప్రాయాల కనుగుణంగానే సాధారణంగా నడుచుకునేవారు. జగన్నాథంగారికి సత్యంనాన్నగారినిగురించి, ఊళ్లోనలుగురికీ తెలిసిన పెద్దమనిషి అవడాన్ని బాగానే తెలుసును. వారి కుటుంబపువారితో రాధ

మ్మకు ఇరుగుపొరుగు పరిచయం ఉన్నసంగతికూడా, అప్పుడప్పుడు సంభాషణలో రాధమ్మ చెప్పే సంగతులనుపట్టి తెలుసును. రాధమ్మకు ఉబుసుపోకకు అటువంటి మంచి ఇరుగుపొరుగుండడం ఆయనకూ యిష్టమే. అందుచేత ఇల్లుమార్చే ఉద్దేశమూ, ప్రస్తావనా అంతతోనే ఆగిపోయాయి.

సత్యానికీసంగతి రెండోరోజు ప్రొద్దున్నే పిల్లతే చెప్పాలని రాధమ్మ అనుకుంది. ఆమె ఒకటి రెండు సార్లు పెరటివేపు చూచినా సత్యం జాడిచెట్టుకేసి వచ్చేసూచన లగపడలేదు. వంట పూర్తిఅయ్యాక పెరటిగోడవద్దకు వెళ్ళి, ఆవలి పెరట్లోంచి వెడుతున్న సత్యం అమ్మమ్మను పలకరించి 'వంటయిందా మామ్మగారూ? పిల్లలు పెందరాడే భోంచేస్తారు గావును' అని చిన్న సంభాషణ ప్రారంభించింది. 'ఆc. వంటయింది. ఏమి గ్రహచారమో, నాయన నిన్నరాత్రి పస్తు పడుకున్నాడు! ఈపూటా లంకణమే' అంది. రాధమ్మ చాలాకంగారుపడి వివరాలడిగి తెలుసుకుంది. ఆమెకు చెప్పరాని బాధా, ఆరాటమూ కలిగాయి. ఇల్లు మార్చడంసంగతి చెప్పి అనవసరంగా సత్యానికి వ్యధకలిగించానేమోనని చాలా నొచ్చుకుంది. ఆమె భర్త భోజనం చేస్తున్నప్పుడు 'పాపం, వాళ్ళబ్బాయి నిన్న గడపతగిలి పడిపోయాట్ట. దెబ్బ మోపుగా

తగిలి జ్వరం వచ్చిందిట. ఎంత బుద్ధిమంతుడైన పిల్లలు! మధ్యాహ్నమోసారి వెళ్ళి చూడాలనివుంది' అంది. 'అలాగా, పాపం. అవును చూచిరా' అన్నా రాయన.

మధ్యాహ్నం పనిమనిషిని కాస్త పెందరాళే రమ్మని, ఉండమని చెప్పి, రాధమ్మ సత్యంవాళ్ళింటికి వెళ్ళింది. ఆమెను చూడగానే సత్యంతల్లి ఆప్యాయంగా ఆహ్వానిస్తూ, సావిట్లో చాప వేసి కూర్చోపెట్టింది. 'అబ్బాయి లంకణంతో పడుకున్నాడుట కదూ పాపం, ఎలావుంది?' అని రాధమ్మ అడిగింది.

''నిన్న పొద్దున్న బాగానేవున్నాడు. మధ్యాహ్నం వంటింట్లోకి రాలేదని, అట్టముక్క, కాఫీ వాడిగదిలోకి తీసుకవెళ్ళేటప్పటికి పడుకునివున్నాడు. అప్పటికి జ్వరం ఉన్నట్టులేదు. కాని, అట్టముక్క ముట్టుకుంటేకదూ! మరేమిబాధగావుందో, కంటతడి పెట్టినంత చేసి 'కూర్చోవే' అన్నాడు. కూర్చొని కాస్త యిలా ఇంట్లోకి వెళ్ళానో లేదో, ముఖం కడుక్కోవడానికి వెళ్ళాట్ట, నిసం కాదూమరీ, గడపతగిలి తూలిపడ్డాడు. నానాగాభరాపడిపోయాం. ఎవరినేనా పిలవకూడదూమా? అంత దెబ్బతగిలి ఏమీలేదంటూ తనమటుకు తానే లేచి వెళ్ళిపోయాడు. చిన్నతనం కాకపోతే మరేమిటి? రాత్రికి జ్వరంతగిలి జానతాగి పడుకున్నాడు వాళ్ళ

నాన్నగారు డాక్టరుగారిని పిలుచుకువచ్చిచూపించారు. ఆయనధర్మాన్ని మరేం ఫరవాలేదన్నారు. పొద్దున్నేనా ఆట్టే జ్వరంలేదుకాని అన్నహితవుంటేనా? కాస్త ఓవల్ టీనుతాగి పడుకున్నాడు. ఎలాగేనా, చెప్పడుకాని, దెబ్బ మోపుగానే తగిలినట్టుంది. ఏమీ లేదు మందొద్దంటాడు. మందుతాగక నయమెలా అవుతుంది? ఒకమోతాదు మందుతాగడం బ్రహ్మాండమయింది. ఇంకా రెండుమోతాదులూ అలాగే వున్నాయి' అని ఇంకా ఏమో కాస్తచాదస్తంగా చెప్పబోతూండగా, రాధమ్మ దుఃఖాన్నాపుకొని, 'అబ్బాయిదగ్గిరే కూర్చుందాం' అంటూ లేచింది. సత్యంఅమ్మా, చెల్లాయీ, రాధమ్మా సత్యంపడుకున్న గదిలోకి వెళ్ళారు.

సత్యం అప్పుడు నిద్రపోతున్నాడు. రాధమ్మ వస్తూనే సత్యంమంచంమీదే కూచొని బుగ్గమీద చెయ్యివేసి, మెల్లగా 'అట్టే జ్వరం లేదులెండి' అంది. సత్యాన్ని ఆస్థితిలో చూచేటప్పటికి ఆమెకళ్ళల్లో నీళ్లు తిరిగాయి. బలవంతంగా ఉద్వేగాన్నాపుకొని, సత్యం వొళ్లు నెమ్మదిగా నిమిరింది. సత్యం, అప్పుడే పట్టిన చిన్న కునుకునుండి నిద్రలేచి కళ్ళుతెరచి ఆశ్చర్యంతో ఆమెవేపు చూశాడు. 'రాధమ్మ వచ్చిందిబాబూ' అంది వాళ్ళమ్మ. సత్యం మరింత ఆశ్చర్యపడినవాడిలా

చూస్తూ మెల్లగా 'రాధమ్మగారూ' అన్నాడు. అనువు లాపుకోలేక కాబోలు, రాధమ్మముఖం అటుతిప్పుకుంది. సత్యంచేయిని తనచేతిలోకితీసుకొని అతి ఆప్యాయతతో 'నేనే. ఎలావుంది, వొంట్లో కాస్త సుళువుగావుందా?' అంది.

సత్యం కొంచెం సిగ్గుపడి, సన్నగానవ్వి. 'మరేం లేదండీ, బాగానేవుంది' అన్నాడు. 'మరి మందు పుచ్చుకోకపోతే వేగం నయమెలాఅవుతుంది' అంటూ సత్యంవాళ్ళమ్మను మందుసీసా అడిగి. సత్యాన్ని పుచ్చుకోమంది. సత్యం వెంటనే పుచ్చేసుకున్నాడు. సత్యంతల్లికి చాలా సంతోషమయింది. సత్యం లేచి కూచోబోయాడు. రాధమ్మ 'నిరసంగా వుంటుంది, పడుకో, లేవకు' అని వారించింది. సత్యంవాళ్ళమ్మ 'ఏమేవ్, నీళ్ళుమరిగాయి. కాఫీ కలుపు పాపం పొద్దుటినుంచీ వస్తున్నాడు. ఆ ఓవల్ టీనేనా సరిగా పుచ్చుకో లేదు' అంటూ వచ్చి, రాధమ్మనుచూచి సంతోషంతో పలకరించింది. సత్యంతల్లి కాఫీ కలప డానికి వెళ్ళింది. చెల్లాయికూడా వాళ్ళమ్మతో వెళ్ళింది. 'నే నుంటానులెండి, మామ్మగారూ, పని ఏమేనావుంటే చూసుకురాండి' అంది రాధమ్మ. 'అలాగే నమ్మా; అమ్మాయి కాఫీకలిపి తీసుకువస్తుంది. ఇదిగో, యిప్పుడేవస్తున్నా' అని ఆమెకూడా లోనికివెళ్ళింది.

సత్యం రాధమ్మ వేపు సంతృప్తితోనూ, సిగ్గుతోనూ చూస్తున్నాడు. 'మరేం గట్టిగా దెబ్బతగల లేదుకదా సత్యం? నాతో చెప్పు' అంది రాధమ్మ బుజ్జగిస్తున్నట్టు. 'లేదండీ; కొంచెం ఇరుకుపట్టి నొప్పెట్టింది. ఇంక తగ్గిపోతుంది' అన్నాడు. రాధమ్మ ఒక్క క్షణం ఊరుకుని, 'ఇల్లు మార్చడం లేదుసుమీ; అసలు మార్చడం ఆయనకీ ఇష్టంలేదు. ఇల్లేదో ఖాళీగావుందని మాటవరసకన్నట్టుంది. మాకీ యిల్లే సమీపాయంగా వుంది. మార్చే ప్రసక్తేంలేదు' అంది.

ఇంతవరకూ బాధిస్తున్న అనుమానాన్ని తీర్చుకోడానికి తటపటాయిస్తున్న సత్యానికి మధురగానంలాగా వినిపించాయావాక్యాలు. నిర్మలాకాశంలో చంద్రునిలాగ కనిపించింది రాధమ్మ ముఖం! మాట్లాడకుండా నిశ్శబ్దంగా ఒకరి ఆత్మీయత నొకరు ఆనందిస్తూ కూర్చున్నారు.

ఇంతలోకే సత్యంతల్లి కాఫీతీసుకువచ్చి, 'నువ్విస్తే మందు పుచ్చుకున్నాడు; నువ్వు చెబితేనే వినేట్టున్నాడు; కాఫీకూడా నువ్వే ఇవ్వమ్మాయ్' అంది. రాధమ్మ గళాసందుకొని సత్యానికిచ్చింది. 'రాధమ్మకో?' అన్నాడు సత్యం. 'రాధమ్మకీ తెస్తాను' అని నవ్వుతూ రాధమ్మ వద్దంటున్నా సత్యంవాళ్ళమ్మ లోనికివెళ్ళింది. 'నువ్వు పుచ్చుకుంటూండు మరి' రాధమ్మ నవ్వుతూ

సత్యంతో అంది. సత్యంకూడా నవ్వుతూ పుచ్చుకో సాగేడు. సత్యంతల్లి గళాసుతో కాఫీ తెచ్చి రాధమ్మ కిస్తూ 'చూశావా అమ్మాయ్, అబ్బాయికి నువ్వంటే ఎంత ఆపేక్షో! ఈమధ్యంత పెద్దమనిషితరహా ఒచ్చిం దనుకున్నావు!' అంది నవ్వుతూ. రాధమ్మకూడా నవ్వింది.

సత్యానికిమటుకూ చాలా సిగ్గువేసింది. రాధమ్మ వేపు కాని, వాళ్ళమ్మ వేపుకాని చూడలేకపోయాడు. తరువాత సత్యంవాళ్ళమ్మమ్మకూడా వచ్చి కూచుంది. వాళ్ళంతా ఏదో సాంసారిక లోకాభిరామాయణం మాట్లాడుకుంటూంటే సత్యం వింటూ పడుకున్నాడు. సూర్యాస్తమయ వేళ కావచ్చేవరకు ఉండి, వస్తానని చెప్పి రాధమ్మ లేచింది. 'ఒక్క ఆత్రేపీ, పాపం ఇబ్బందే కాని రేపుకూడా ఒక్కసారి రా అమ్మాయ్; నీచేత్తోనే మళ్ళీ మందిద్దువుకాని. అచ్చు పెత్తల్లి మోస్తరే, ఆ ఓపికా, ఆనవ్వుముఖమునున్న' అని సత్యం అమ్మమ్మ ఆప్యాయంగా అంది. 'అలాగే వస్తాను మామ్మగారూ; ఏమంత దూరమని పనిపెట్టుకు రావడానికి? రాత్రి జావ తాగి, ఆ మోతాదు మందుకూడా పుచ్చుకోఏం, సత్యం? రేపటికి సుళువుగా వుంటుంది లెండి' అంటూ బొట్టు పెట్టాక వెళ్ళింది.

రాత్రి భోజనాలవేళ అంతా వంటింట్లో ఉన్న

ప్పుడు, సత్యం అమ్మమ్మ సత్యందగ్గర కూచుంది. 'అవును కానీ, అమ్మమ్మా, రాధమ్మ పెత్తల్లిని నీకంత బాగా తెలుసునా?' సత్యం అడిగాడు.

"తెలియకేం! ఇరుగూ పొరుగూ ఒక్క కుటుంబంలా వుండేవాళ్లం, ఒకటా, రెండా – నాలుగు సంవత్సరాలు!"

"రాధమ్మ పెత్తల్లి రాధమ్మగారిలాగే వుంటుందా అమ్మమ్మా?"

"అవును నాయనా. రాధమ్మతో పాటు, ఆ నెమ్మదీ, చనువూ, మంచితనమూ అంతా వాళ్ల పెత్తల్లి మోస్తరే."

సత్యం మాట్లాడకుండా ఏదో ఊహిస్తూ పడుకున్నాడు. జావా, తరువాత పండిపా కూడా తేగానే పుచ్చుకున్నాడు. కాస్త చురుకుగానూ ఉల్లాసంగానూ ఉన్నాడు. మర్నాడు ప్రొద్దుటికి బాగా సుళువుగా వుంది. కాలు నొప్పి యింకా తీరనందున స్నానానికి వెళ్ళలేదు. కాని వళ్ళూ ముఖమూ తుడుచుకొని దుస్తులు మార్చుకున్నాడు. చెల్లాయిని పుస్తకాలు తెచ్చుకోమని కాస్త పాఠాలు చెబుతూ కాలక్షేపం చేశాడు. పథ్యం పుచ్చుకున్నాక కథలపుస్తకాలూ, పత్రికలూ చదువుకోసాగేడు. రాధమ్మ నిన్న రావడం, అతనివద్ద కూచోవడం చాలా ఉల్లాసం కలిగించింది, ఇవాళ కూడా వస్తుందని

ఉత్సాహంగా వుంది. ఇల్లు మార్చడం ప్రసక్తి అప్పుడే మరిచిపోయాడు!

మర్నాడు రాధమ్మ సత్యానికో దానిమ్మపండూ సత్యంతల్లీ చెల్లాయీ తల్లో పెట్టుకోడానికి గుచ్చిన పూలూ తీసుకొని వచ్చింది. ఆమెకూడా కొత్తచీర కట్టుకుని తల్లో యిన్ని పూలు పెట్టుకుంది. అంతా సత్యం ఉన్న గదిలోనే కూర్చున్నారు. సత్యం పక్క మీదే చేరబడి కూర్చున్నాడు. అబ్బాయికి బాగా నయమవుతూ ఉత్సాహంగా వుండడం సత్యం వాళ్ల మ్మకూ, అమ్మమ్మకూ సంతోషంగా వుంది.

ఈసంగతులూ, ఆసంగతులూ, మధ్య మధ్య ఏవో చిన్న ఇంటిపనులో, కూరలుతరగడంలాంటి వంటపనులో, చూచుకుంటూనే కులాసాగా చెప్పుకో సాగేరు. సత్యానికి కాఫీ తీసుకవచ్చినప్పుడు అమ్మాయి చేత రాధమ్మకుకూడా కాఫీ, ఫలహారం సత్యంతల్లి తెప్పించింది. 'ఇవన్నీ ఎందుకండీ?' అంది రాధమ్మ ఆశ్చర్యపడి. సత్యంతల్లి నవ్వుతూ, 'రాధమ్మవస్తుంది; ఏమేనా చెయ్యకపోతే ఏంబాగుంటుందని పట్టుపట్టాడు' అంది. రాధమ్మ నవ్వింది. సత్యానికవాళ చెప్ప లేనంత సిగ్గువేసింది.

సత్యం అమ్మమ్మ, రాధమ్మ పెత్తల్లిగురించిన పూర్వసంగతులు చెబుతూ, 'ఎన్నిపాట లొచ్చును;

ఎంత బాగా పాడేదనుకున్నావ్! నువ్వేమేనా నేర్చుకున్నావా ?' రాధమ్మనడిగింది. 'ఏదో నేర్చుకున్నా, కాని ఈమధ్యంత అలవాటుగా పాడడం లేదు' అని రాధమ్మ చెప్పి, పాడమంటే ఓ కీర్తన పాడింది. 'మీ పెత్తల్లి మోస్తరే; మంచికంఠం, మట్టుగా ఉంటుంది' అని అమ్మమ్మ ప్రశంసించింది. సత్యం చెల్లాయిని కూడా వాళ్ళమ్మ ఓ పాట పాడమంది. అమ్మాయి మొహమాటపడినా, పాడింది. ఆ సమయ వేళ కావచ్చే వరకూ కలాసాగా కాలక్షేపం చేసి, అమ్మాయి చేత బొట్టు పెట్టించుకుని, తాంబూలం మందుకుని రాధమ్మ వెళ్ళింది.

సత్యానికి బాగా నయమయినా, కాలు నొప్పి పూర్తిగాపోయి మామూలుగా పైకి వెళ్ళి తిరగడానికి నాలుగైదురోజులు పట్టింది. అయితే ఉపాధ కేమీ లోటు లేదు. చెల్లాయికి సరదాగా పాఠాలు నేర్పడం, మధ్యాహ్నం వాళ్ళమ్మ కాఫీ కాచపోతున్నప్పుడు 'ఉండుండు కాఫీగుండ నే వేస్తా' నంటూ హెచ్చు గుండ వేసి చిక్కగానే కలపటం, రెండుపూట్లా స్నానం చేసి, తల బాగా దువ్వి, శుభ్రంగా తయారవడం, పుస్తకాలు చదువుకోడం, మొత్తంమీద చాలా సరదాగా వున్నాడు. ఎప్పుడేనా మరీ ఉపాధగా ఉన్నప్పుడు వాళ్ళమ్మావాళ్ళూ విస్తుపోయేంత పెద్ద గొం

తుకతో ఇదివరకెవరూ వినని పాటో రాగమో ఆలా
పన చేసేవాడుకూడాను. రాధమ్మ, సత్యంకుశలం
పెరటిగోడవద్దే, పెరట్లోకి వచ్చేవారెవరివల్లనుండైనా
తెలుసుకొని సంతోషించేది.

ఓ రోజు మధ్యాహ్నం, సత్యం బాగాతయారై
వాళ్ళమ్మావాళ్లూ అరటిపువ్వులు ఒలుస్తూంటే, తాను
కూడా ఒలుస్తూ కూచున్నాడు. వాళ్ళమ్మమ్మ 'ఏం
నాయనా, ఎన్నడూలేనిది యిలా బుద్ధి పుట్టింది!
మంచిదే నేర్చుకో; నీ పెళ్ళానికి రేపు సాయంగా ఉం
టుంది' అంది, నవ్వుతూ. సత్యం బిగ్గరగా నవ్వ
సాగేడు. 'ఎంత సిగ్గొచ్చిందే!' అని అమ్మమ్మ అం
టూండగానే రాధమ్మ వచ్చింది. ఆమెవచ్చి అవా
ళకు నాలుగైదు రోజులయింది; సత్యం నవ్వుతూనే,
సిగ్గుతో ఇంట్లోకి వెళ్ళిపోయాడు.

రాధమ్మ, సంగతి తెలుసుకొని, నవ్వుతూ
కూచుంది. ఇంతలో చెల్లాయి రాధమ్మకు కాఫీ
తీసుకవచ్చింది. 'బాగుంది! వచ్చినప్పుడల్లా నాకే
మర్యాద ఏమిటి! నేనేం కొత్తదాన్నా?' అంది రాధమ్మ.
సత్యమే చెల్లాయికి చెప్పి పంపించి ఉంటాడని రాధ
మ్మకు తట్టింది. కొంతసేపు ఆ కబుర్లూ, ఈ కబుర్లూ
చెప్పుకున్నాక చెల్లాయి తిరిగివచ్చి, 'కొత్త గ్రామ
ఫోన్ రికార్డు వింటురుగాని రాండి, అన్నాయ్ పెద్ద

న్నాడు' అని రాధమ్మను మేడమీద సత్యంగదికి తీసుకు వెళ్ళింది. సత్యం తానే పిలవటానికి మొహ మాటపడ్డాడు.

టేబిలూ, కుర్చీ, పుస్తకాల అల్మారూ, మంచ మూ, గోడకో అద్దమూ, కేలండరూ విద్యార్థుల కనవ సరమైన వేవీ అక్కర్లేకుండా గది క్లుప్తంగా, శుభ్రం గానే వుంది. రాధమ్మ మేడమీదకు చనువుగా గ్రామఫోన్ రికార్డులు వినడానికి రావడం సత్యానికి పర మానందమయింది. రాధమ్మను కూర్చోమని సత్యం కొంచెం మొహమాటపడుతూనే, మర్యాదచేశాడు. 'కాలు నొప్పి బాగా తగ్గిందా? మామూలుగావుందా, సత్యం?' ఆమె అడిగింది. మరేమీ లేదనీ, బాగా వుందనీ చెప్పాడు. చెల్లాయి తన డ్రాయింగు బొమ్మల పుస్తకాలు తెచ్చి రాధమ్మకు చూపించింది. రికార్డు పాటలు వింటూ సరదాగా కొంతసేపు గడిపాక పెద్ద వాళ్ళతోకూడా చెప్పి, రాధమ్మ వెళ్ళింది.

ఇది జరిగిన తరువాత ఎప్పుడేనా రాధమ్మ వీరిం టికి రావడం, సత్య వాళ్ళమ్మా వాళ్ళూకూడా రాధమ్మ యింటికి వెళ్ళడం జరుగుతూండేది. ఎప్పటిలాగా జాంవి చెట్టు సమావేశాలుకూడా జరగసాగేయి. ఈమధ్య ఇంటివారందరికీ రాధమ్మతో కలిగిన చనువుమూలాన్ని సత్యానికి వాళ్ళ వాళ్ళెవరేనా పెరట్లో ఉండడం తట

సించినా గోడవద్ద రాధమ్మతో మాట్లాడడం అంత సంకోచం కలిగించేది కాదు. వాళ్ల వాళ్లకుకూడా కొత్త అనిపించినట్టు లేదు. సాయంకాలంమటుకూ షికారుగా తిరగడానికో, టెన్నిస్‌కో వెళ్లడం, కసరత్తు పొద్దున్నే చెయ్యడం సత్యం మునపటిలాగానే సాగిస్తు న్నాడు. అప్పుడప్పుడుతనగదీ, చెల్లాయిగదీ శుభ్రంగా సర్దడం, నాన్నగారి సైకిలు శుభ్రంగా తుడిచి, చిన్న మరమ్మతు లేవేనా వుంటే చేయడంకూడా అతనికి అలవాటయింది.

ఈ వేసవి సెలవల్లోనే సత్యంచెల్లెలు, పార్వతి, పుట్టినదినం వచ్చింది. పార్వతి నేస్తులు ముగ్గురు నలు గురినీ, రాధమ్మనీకూడా ఫలహారానికి పిలిచారు. రాధమ్మ పార్వతికో చిన్న కానుక, అందముగా గుచ్చిన పూలచెండ్లూ తీసుకొని, తానుకూడా ముస్తాబై, వచ్చింది. సత్యం గ్రామఫోన్ రికార్డులు వేస్తూనూ, ఫలహారాలందిస్తూనూ ఉల్లాసంగా ఉన్నాడు. పార్వతి నేస్తులు వెళ్లినతరువాత రాధమ్మకూడా వెళ్లబోతూంటే, సత్యం 'ధీరె ధీరె యమునాతీరె పాడరూ?' అంటూ చెల్లెలి హార్మోనియం పైకి తీశాడు. రాధమ్మ నవ్వి, హార్మోనియం వాయిస్తూ పాడింది. అప్పుడు సత్యం వాళ్ళమ్మావాళ్ళూ ఇంట్లోపనుల్లో ఉన్నారు. నాన్న గారు ఫలహారాల వేళవచ్చి, తృప్తితో ఓసారిచూచి,

వీధిలోకి యిదివరకే వెళ్ళిపోయారు. సత్యాని కాపాట వింటూంటే ఏవో అస్పష్టమైన మధురభావాలూ, భవిష్యజ్జీవితపు సుఖస్వప్నాలూ లీలాప్రాయంగా మనసుకు తోచేవి. ఎంతసేపు విన్నా వినాలనే అనిపించేది. సరదాగా కాలక్షేపం అయింది. రాధమ్మ అందరితో చెప్పి వెళ్ళిపోయింది.

సెలవు లయిపోవచ్చాయి. మరో వారంరోజుల్లో కాలేజీ తెరుస్తారు. రోజులు ఉల్లాసంగా గడుస్తున్నాయి. సత్యానికి బాగా మార్కులొచ్చి పేసైనసంగతి తెలిసి రాధమ్మకూడా చాలా సంతోషించింది. అవాళరాత్రి భోజనాలయాక రాధమ్మ భర్తతో కబుర్లుచెబుతూ 'వాళ్ళమ్మాయినీ, అబ్బాయినీ ఈ ఆదివారం భోజనానికి పిలవాలనివుంది' అంది. రాధమ్మకు సత్యంవాళ్ళ కుటుంబంతో ఈమధ్య పెరుగుతూన్న చనువు జగన్నాధంగారికి తెలుసును; కాని కొంచెం ఆశ్చర్యపడి, 'ఊరికినేపిలుస్తే వాళ్ళేమీ అనుకోరుకదా?' అన్నారు.

''సరదాకి పిలుద్దామనీ; అబ్బే వాళ్ళేమనుకుంటారు. చాలా చనువుగానూ, ఆప్యాయంగానూ ఉంటారు.''

''తప్పకుండా పిలువు.''

''మరి ఆదివారంనాడు పెందరాళేవచ్చి, కాస్తసేపు వాళ్లతో కూర్చోవాలి సుమండీ!''

''అలాగే.''

మర్నాడు రాధమ్మే పిలవడానికి వచ్చింది. సత్యం తల్లీ, అమ్మమ్మాకూడా సంతోషించారు. రాత్రి ఆసంగతివిని, సత్యంనాన్నగారు కొద్దిగా ఆశ్చర్యపడి, 'జగన్నాథంగారింటికి అబ్బాయినీ అమ్మాయినీ భోజనానికి పిలిచారా' అని నవ్వుతూ అన్నారు.

రాధమ్మ పెద్ద ఏందేమీ చేయలేదు; బంగాళా దుంప ముక్కలు వేయించింది, వంకాయ మెంతికారం; పప్పులుసూ, పెరుగుపచ్చడి; ఊరగాయా, అప్పడాలూ, వడియాలూ; కమ్మని పెరుగూ, చక్రకేళీఅరటిపండ్లూ, సేమియాపాయసం — సుష్టయిన భోజనమటుకూ శుభ్రంగా తయారుచేసి వడ్డించింది. జగన్నాథంగారు కూడా పంక్తిని కూర్చున్నారు. ఆయనకూ పిల్లలంటే సరదావే. ఇంటరు ఫైక్లాసుకొచ్చినందుకు సత్యాన్ని అభినందిస్తూ, అమ్మాయినికూడా కుశలమడుగుతూ, ఉల్లాసంగా సంభాషించారు.

పొరుగింటి పుల్లకూర రుచి అనే సామెత వుండనే వుంది. రోజూ ఇంటూండే భోజనంకంటే, ఎప్పుడేనా తగుమాత్రం మార్పుంటే సాధారణంగా అందరికీ ఆకర్షణీయంగానే వుంటుంది. ఏమయినా వంటకాలన్నీ ముఖ్యంగా సత్యానికి బహు రుచికరంగా తోచాయి. రాధమ్మభోజనంకూడా అయ్యాక ఓగంటసేపువరకూ వుండి, సరదాగా కాలక్షేపంచేసి సత్యం, పార్వతి

వెళతామని చెప్పి లేచారు. సత్యం ఇంటికివచ్చి రాధమ్మ వంటకాలను పొగిడి, వాళ్ళింట్లోవాళ్ళు కొంచెం నవ్వుకోవడం గమనించి సిగ్గుపడి ఊరుకున్నాడు.

కాలేజీ తెరిచారు; పాఠాలు మొదలయ్యాయి. సత్యానికి చదువ్వూ, టెన్నిస్‌లోనే కాకుండా వాళ్ళ ఇంటిముందు ఆవరణలో చిన్న పూలతోట పెంచడంలో కూడా శ్రద్ధా, ఆసక్తీ కలిగాయి. గులాబీ, మల్లె, జాజి, చామంతి, మందార, వాడాంబరం, నీలాంబరం వగైరా పూలమొక్కలు వేసి రోజూ పొద్దున్నే ఓగంటో అరగంటో తోటపని చెయ్యడం కొత్తగా అలవర్చుకున్నాడు. ఏదేనా మంచి పూల అంట్లు సంపాదించినప్పుడు రాధమ్మకూ సరదా అని ఆమెకు ఇస్తూండేవాడు.

కసరత్తుకూడా అలవాటుగా కాస్సేపు పొద్దునో సాయంకాలమో చేస్తూండడాన్ని కండరాలు బలంగా, అందంగా పెరగసాగేయి. సహజబాల్యనైర్మల్యంతోపాటు యువకచిహ్నాలుకూడా దృఢపడసాగినవి. మొదటినుంచీ నిక్కరూ, లోనికిదోపుకొని షర్టూ, తేలికైన జోడూ వేసుకోవడం అతనికి అలవాటు. నిరాడంబరమైన ఆ తేలికదుస్తులే అతనికి బాగా అమిరాయి. రెండుపూట్లా చన్నీళ్ల స్నానంచేస్తూ, ఎప్పుడూ శుభ్రంగా వుండేవాడు. ఇంట్లో తీరికసమయాల్లో

సాధారణంగా చిన్నలాగూ, బనియనూ మాత్రమే వేసుకొనేవాడు. సౌష్టవయుతమైన శరీరమవడాన్ని, అదెవరికీ వెగటుగా తోచక యింపుగానే వుండేది.

చిలిపిచేష్టలట్టే లేక సత్యం నిదానమూ, నిలకడా కలవాడైనా అంత మొహమాటస్తుడూ కాదు, మరీ అంత మడికట్టుకున్నట్టుండే స్వభావమూ కాదు. అతని క్లాసులోకూడా అయిదారుగురు విద్యార్థినులున్నారు. అమ్మాయిలెవరైనా, వాళ్లెవరేనా సత్యంతో కాని, సత్యం వారితో కాని మాట్లాడే అవసరం ఎప్పుడేనా వచ్చినా, చాలామంది కుర్రవాళ్లవలె అనవసర మొహమాటమూ, కంగారూపడి బైతులాగా ఎంత మాత్రమూ అయేవాడూ కాదు, విద్యార్థినుల వెనక తేలికగానో, హేళనగానో చేసే వ్యర్థప్రసంగాల్లో పాల్గొనేవాడూ కాడు. 'కాలేజీ పెద్దమనిషి' అని తోటి విద్యార్థులు ఎప్పుడేనా హాస్యంచేసినా నవ్వి ఊరుకునేవాడు. తోటి సహాధ్యాయులకుమటుకూ సత్యంమీద ఒక విధమైన గురీ, తమ ఆచరణయెడల ఓ అస్పష్టమైన అసంతృప్తీ కలుగక పోలేదు.

సత్యాని కిదివరకు ఆటలవిషయమైన వార్తలు తప్ప, పత్రికల్లో ఇతర విషయాలందంత ఆసక్తి ఉండేది కాదు. ఇప్పుడు పత్రికల్లో ఇతర వార్తలూ, విషయాలూ చదివి తెలుసుకోవడంలో ఆసక్తి పెరుగుతూంది. వాళ్ళ

నాన్నగారు తెప్పించే పత్రికే కాకుండా కాలేజీకివచ్చే వివిధ పత్రికలూ, మేగజైనులూ కూడా చూస్తూండే వాడు. సినిమాలకు ఎప్పుడేనా వెళ్ళేవాడు కాని సినిమాలన్నా, సినిమా పత్రికలన్నా ప్రత్యేక సరదా మటుకు లేదు. వివిధ దేశాల గురించినవీ, ఉత్సాహ జనకమైనవీ, నూతన విషయాల గూర్చినవీ చారవా, సాహసమూ క్లిష్టపరిస్థితులకు లొంగిపోని కట్టుదిట్టమైన ఆత్మవిశ్వాసముతో కూడిన శీలమూ ప్రదర్శితమయే పుస్తకాలంటే సరదా హెచ్చయింది.

డికెన్స్, డ్యూమాస్, స్కాట్ వంటి వారి రచనలు ఇంగ్లీషులోనూ, వీరేశలింగంగారి 'రాజశేఖర చరిత్ర', చిలకమర్తివారి 'రామచంద్ర విజయం' సాహితీ సమితివారి ప్రచురణలూ వంటి తెలుగుపుస్తకాలూకూడా, తీరిక సమయాల్లో చదివేవాడు. సెలవు రోజుల్లో వాళ్ళింటికివచ్చే తెలుగుకథల వారపత్రికలు కూడా చదివేవాడు. అయితే, యింజనీరింగు ఎలాగేనా చదవాలని ఆశయముండడంచేత క్లాసురావాలని పాఠాలుమటుకూ శ్రద్ధగా చదివేవాడు.

తనకి నచ్చిన పుస్తకాలూ, మంచికథ అనిపించినట్లయితే, ఆకథ ప్రచురణమైన వారపత్రికా, చదవమని చెప్పి, రాధమ్మ కిస్తూండేవాడుకూడాను. సత్యం జీవితపు తీరులోనూ, ఆశయాల్లోనూ వస్తూన్న మార్పు

లకు రాధమ్మతో కలిగిన స్నేహానుబంధము విద్యుచ్ఛక్తివలె అంతర్గతమైన ఒక అందమైన కాంతినిస్తూంది. సహవాస స్మృతులనుపట్టీ, అచటి ప్రశాంతవాతావరణాన్నిపట్టీ, జామిచెట్టుమీద తానూ, గోడనానుకొని ఆమే మాట్లాడుకోవడంలో ప్రత్యేకఆకర్షణ ఉంటూ వస్తున్నది.

సత్యం ఎప్పుడేనా రాధమ్మగారింటికి కూడా వెళ్ళేవాడు. జగన్నాధంగా రింటివద్దఉన్నప్పుడు, సత్యం అటువేపునుంచి వెళ్ళడం తటస్థిస్తే, ఆయన సత్యాన్ని పలకరించి పిలిచేవారు. ఎప్పుడేనా సత్యం వాళ్ళింటికి జగన్నాధంగారుకూడా వచ్చి సత్యం నాన్నగారితో కాస్త కుశల సంభాషణచేసి, సత్యాన్ని పలకరించి వెళ్ళేవారు. జగన్నాధంగారికిన్నీ సత్యమంటే సరదా, చనువూ హెచ్చయాయి. ఉల్లాసంగా ఉన్నప్పుడు సత్యాన్ని హాస్యంకూడాచేస్తూ, 'అల్లుడూ' అని పిలిచేవారు. 'అల్లుడూ, మీఅత్త యింకా పిల్లని కనకుండా ఉందోయ్ !' అనో, 'ఫస్టుక్లాసులో పేసవాలి సుమీ, మీఅత్తనిన్నుచూసి మురిసిపోతూంటుంది' అనో అంటూండేవారు. ఆమాటలకు సత్యం, రాధమ్మ కూడా నవ్వేవారు. సత్యమన్నా, వాళ్ల కుటుంబమన్నా రాధమ్మకు చాలా ఆప్యాయత అని ఆయనకు తెలుసును. ఆయనకూ చాలాఇష్టమూ, సదభిప్రాయమూ ఉన్నాయి.

ఓరోజు సాయంకాలం సత్యం షికారుగా తిరిగి వస్తూ రాధమ్మగారింటికి, ఒక్కసారి చూచిపోదామని, వచ్చాడు. జగన్నాధంగారూ, రాధమ్మా సినిమాకు ప్రయాణమవుతున్నారు. 'ఏమోయ్ అల్లుడూ, సమయానికే వచ్చావు. సినీమాకు నువ్వుకూడా రాకూడదూ, మీ అత్తకూడా సంతోషిస్తుంది' అని చనువుగా పిలిచారు. 'అవును, మీ అమ్మతో చెప్పి చెల్లాయి కూడా వస్తుందేమో తీసుకురా' అంది రాధమ్మ. అవాళ సెలవురోజవడాన్నీ, ప్రత్యేకమైన పని ఏమీ లేకపోవడాన్నీ, సినీమాచూచి రెండునెలలుపైగా అవడాన్నీ, సత్యంకూడా సరదాగా 'అలాగే'నని వెళ్ళి, వాళ్ళమ్మతో చెప్పి సొమ్మొందుకుని చెల్లాయినికూడా తీసుకుని త్వరలోనే వచ్చాడు.

అక్కడికి సినీమాథియేటరు దూరంగా లేకపోవడంచేత అంతా నడిచేవెళ్ళారు. జగన్నాధంగారు టిక్కెట్లకోసం వెళ్ళబోతూంటే, 'నే తెస్తా' నంటూ సత్యమే త్వరగావెళ్ళి నాలుగు కుర్చీటిక్కెట్లు తీసుకు వచ్చాడు. 'ఇదేమిటి, నేను పిలవడమూ నువ్వు టిక్కెట్లు కొనడమునూ; మంచి మర్యాదే!' అని జగన్నాధం గారు సొమ్మివ్వబోయారు. సత్యం నవ్వుతూ, 'ఎవరు తెస్తేనేమిటండీ' అని పుచ్చుకున్నాడుకాదు. 'చిన్నవాడివి, యింత మొహమాటమయితే పనికిరాదు'

అంటూ చివరికి రెండుటిక్కెట్లు సొమ్మైనా పుచ్చుకోమని చెబుతూ సత్యానికి బలవంతంమీద ఇచ్చారు.

రాధమ్మతోకూడా సినిమాకి వెళ్ళడం అదే మొదటిసారి. అంతా కలిసి కూర్చోడం సత్యానికి కొంచెం మొహమాటంవేసినా, సరదాగాకూడావుంది. సినిమామధ్య విశ్రాంతివేళకు లైట్లు వెలగ్గానే సత్యానికి తెలిసినవా ళ్ళెవరేనా తనని చూచి ఏమేనా అనుకుంటారేమోనని తాత్కాలికమాత్రం కాస్త అనిపించినమాట నిజమే. జగన్నాధంగారు ఖారాకిళ్ళీ వేసుకోడానికకాబోలు పైకివెళ్ళారు. సత్యంకూడా మిగాకిళ్ళీలు తేవడానికి బైటికి వెళ్ళాడు. తిరిగి వచ్చేటప్పటికి జగన్నాధంగారు ఎవరో పరిచయస్తునితో నాలుగుసీట్లవతల కూర్చొని మాట్లాడుతున్నారు. పార్వతి, తన క్లాసుపిల్లలతో కాంసు మాట్లాడుతూంది. లైట్లప్పుడే ఆరి, పెద్ద ఉరుములూ మెరుపులూ, దెబ్బలాటలూ, నానాగాభరా కలిగించేలాంటి హిందీపిక్చరు భాగం చూపబడుతోంది. సినిమాహాలు యింకా గోలగావుంది. రాధమ్మకు కిళ్ళీఇచ్చాడు. ఆమె నవ్వింది. కథ ప్రారంభమై సద్దుమణిగేవరకూ ఇద్దరూ సంభాషిస్తూ కూర్చున్నారు. సినిమాలయాక అంతాకలిసివచ్చేశారు.

ఈరోజుల్లోనే సత్యం ఫ్లూట్ ఒకటి కొని తీరిక

సమయాల్లో సాధన చెయ్యడం మొదలెట్టాడు. తనకి నచ్చిన ట్యూన్స్, సినిమాపాటలో, ఎక్కడైనా విన్నవో, కొంచెం మార్చి స్వంతప్రతిభ చూపిస్తూ వాయించబోయేవాడు. అప్పుడప్పుడు శ్రావ్యమైన ట్యూనే ఉద్భవించేది.

ఓరోజు, సూర్యాస్తమయం అయాక, వాళ్ళ డాబామీద పెరటివేపు కూర్చొని వాయిస్తున్నాడు. అతని మనసులో ఏదో స్వరం అస్పష్టంగా, మధురంగా నాట్యంచేస్తోంది. ఏ పిక్చరులోదో, అతనికి నచ్చిన పాట ట్యూనుకాంసు; బృందావనమూ, రాధా మాధవులూ, గోపికలూ, దృశ్యాలు లీలగా జ్ఞప్తికివస్తున్నాయి. అదేనేమో మనసులోపెట్టుకుని వాయిస్తున్నాడు. ఆ గీతం చరణా లతనికి జ్ఞాపకంలేవు. సినిమా పాటల పుస్తకాలు కొనడం అతనికి అలవాటులేదు. సరిగ్గా ఆ ట్యూనే కాకపోయినా, ఏదో శ్రావ్యమైన స్వరమే పాకంలో పడ్డది. వాయిస్తూ, స్వరానికి సరిపోయే చరణాలుకూడా ఊహించసాగేడు.

సత్యానికి కథలు రాయాలనీ, పద్యా లల్లాలనీ ఆశయంలేదు. భావకవి కాబోయే లక్షణాలకంటే, ఇంజనీరు కాబోయే లక్షణాలే అతనిలో అధికం. కాని, అతని ప్రస్తుతస్థితి, వయసునుపట్టి హృదయాన్ని స్పందింపచేసే భావుకత కొంచెం మొలకెత్తడం

సహజమే. అప్రయత్నంగానే ఒకటి రెండు చరణాలు ఊహాలో స్థిరపడ్డాయి. కొంతసేపు వాయించడం అయ్యాక, తన గదిలోకి వెళ్ళి, ఆ ట్యూన్ జ్ఞాపకం ఉంచడానికి కాబోలు, తా నూహించిన చరణాలు నోటు పుస్తకంలో యిట్లా వ్రాశాడు.

''గోకులమంతా గోపికలూ
గోపాలునితో డుక వేడుకలూ
గోపిక వసనా చోరుడ టే
అల్లరి చిల్లరి వాడటనే
రాసక్రీడలు సలుపునటే
రాధతో కూడుక మాధవుడూ
యమునా తటినీ మురళీ మ్రోగెను
పరుగుపరుగునా రారండీ''

ఆ రెండో రోజు జాజిచెట్టువద్ద సంభాషణలో రాధమ్మ అడిగింది, 'నువ్వేనా ఫ్లూట్ వాయిస్తున్నది? ఏమిటా పాట చాలా బాగుంది.'

సత్యం నవ్వి 'అబ్బే పాటేమీ కాదు; మనసులో అనుకునేదొకటి, తీరా వాయించేప్పటికి మరేదో ట్యూనూ' అంటూ సంగతి చెప్పాడు. విని 'గీతాలు కూడా అల్లుతున్నావన్నమాట' అంది. సత్యం సిగ్గుపడి 'అలాంటిదేమీ లేదండీ. ఏదో పాటలాగుంటే

వాయించడానికి సరదాగా వుంటుందనీ. ఈమాటు మీరు హార్మోనియంమీదా, నేను ఫ్లూట్ మీదా వాయిద్దాం. అపస్వరం ఉంటే మీరు దిద్దేదురుగాని. అప్పుడు ట్యూన్ నిజంగా బాగుందో లేదో తెలుస్తుంది. మీ 'ధీరె ధీరె యమునాతీరె' కూడా ప్రేక్టీస్ చేస్తాను చూడండి' అన్నాడు నవ్వుతూ.

'అపస్వరం ఏమీ లేందే. నిజంగా నిన్న వాయించింది చాలా బాగుంది' అంది, హెచ్చరికగా.

సత్యం ఉత్సాహంతో సాధనచేసి అయిదారు, కొంతవరకూ స్వకల్పితాలే అయినా మధురమైనవే, ట్యూనులు మొత్తంమీద మనోరంజితంగానే వాయించడం నేర్చుకున్నాడు. సాధారణంగా పెరటివైపు డాబామీదనే కూర్చుని వాయించేవాడు. రాధమ్మకి వినిపించాలని అతని ఉద్దేశం కాదు; అక్కడైతే ఏకాంతంగానూ, ప్రశాంతంగానూ ఉంటుందనీ పార్వతివద్ద కాకపోయినా వాళ్ళమ్మా, నాన్నగారిముందుమటుకూ వాయించడానికి మొహమాటపడేవాడు.

టెన్నిస్ ఆటా, ఫ్లూట్ పాటా, పూలతోటా, చదువూ, జాజిచెట్టు సమావేశాలూ – చాలా హాయిగా గడుస్తున్నాయి దినాలు. క్రిస్టమస్ సెలవల్లో జరిగిన

కాలేజీ టెన్నిస్ మేచెస్‌లో సెమిఫైనల్స్‌లో గెలిచాడు. చిన్న కప్పు బహుమతి సంపాదించాడుకూడాను. ఆ సంగతి విని కప్పుచూచి రాధమ్మ ఎంతో సంతోషించింది. గర్వమే వేసింది ఆమెకు. 'నేను చెప్పలేదూ సత్యం, మేచెస్‌లో గెలుస్తావనీ? చూస్తూండుమరి; పరీక్షల్లోకూడా ఫస్టుక్లాసులో వస్తావు; పెద్ద ఇంజినీరు వవుతావు' అంది.

బాగా మార్కులొచ్చి పేసవుతేనే కాని ఇంజినీరింగులో సీటు దొరకడంకష్టమని తెలియడంచేతనూ, రాధమ్మయొక్క నెమ్మదైన ప్రోత్సాహంవల్లనూ, శ్రద్ధగా పరీక్షలకు చదవసాగేడు. త్వరలోనే పరీక్షలు సమీపించేశాయి. బాగా వ్రాశాడుకూడాను. రోజూ నాన్నగారు రాత్రి భోజనాలప్పుడు ఎలావ్రాశావని అడిగేవారు. బాగానే వ్రాశానని చెప్పేవాడు. రాధమ్మకుమటుకూ సాయంకాలమే చెప్పేవాడు. తప్పకుండా పేసవుతాననే ఆశిస్తున్నాడు. క్లాసుమాట మటుకూ ఎవరు చెప్పగలరు? అసలు పరీక్షల్లోనే అదృష్టమంటూ ఒకటి చాలామటుకు ఉందికదా!

పరీక్షలైన తరువాత రెండురోజుల వరకూ మధ్యాహ్నంకూడా బాగా నిద్రపోయి విశ్రాంతి తీసుకున్నాడు. మూడోరోజు మధ్యాహ్నం ఫ్లాట్ తీసికొని

రాధమ్మగారింటికి వెడదామనుకున్నాడు. కాని అవాళ సత్యం వాళ్ళింటికి బంధువులు వచ్చారు. వారున్న రెన్నాళ్లూ, వాళ్ళను కనుక్కోవడం, బజారుకు తీసుకు వెళ్ళడం వీటితో రాధమ్మను కలుసుకోడం పడింది కాదు.

వాళ్ళు వెళ్ళిపోయిన మర్నాడు మధ్యాహ్నం జాంచెట్టు కేసి వెళ్ళాడు. చెట్టెక్కేటప్పటికి ఆవల పెరట్లో పూలమొక్కలను చూస్తూ ఒక అబ్బాయి అవుపించాడు. అతను అటు తిరిగి ఉండడాన్ని సత్యాన్ని చూడలేదు. ఇంచుమించు సత్యం ఈడువాడే; తెల్లని పైజామా, షర్టూ వేసుకుని నాజూగ్గానే కనిపిస్తున్నాడు. వసారాలో ఉన్న రాధమ్మతో చనువుగానే మాట్లాడు తూన్నట్టుంది. ఎవరుచెప్మా, అనుకుంటూ సత్యం చెట్టు దిగిపోయాడు. బంధువు లెవ రేనావచ్చారేమో అను కున్నాడు. తీరికగా సెలవురోజులైనా, రాధమ్మని కలు సుకుని నాలుగైదురోజులైనందున షికారుగా సాయం కాలం వెళ్ళివస్తున్నప్పుడు తటపటాయిస్తూనే రాధమ్మ యింటికి వెళ్ళాడు.

రాధమ్మ పూలుపెట్టుకొని ఎక్కడికేనా బయలుదేరడానికి ముస్తాబయినట్టుంది. సత్యాన్ని సాదరంగా పలకరిస్తూ, 'ఏం సత్యం కనిపించడమే లేదు' అంటూండగానే పెరట్లో యిందాక చూచిన అబ్బాయి వచ్చాడు. సత్యాని కతన్ని ఎక్కడో చూచినట్లని

పించింది, కాని చటుక్కున గుర్తుకురాలేదు. అతను కూడా 'ఈ అబ్బాయిని ఎక్కడ చూచానుచెప్మా' అన్నట్టు నవ్వుముఖంతోనే, కాస్త విస్మయంతో సత్యం వేపు చూచాడు. 'ఇతనే సత్యం, మా పింతల్లి కొడుకు మూర్తి' అని పరిచయం చేసింది.

మూర్తికేమీ మొహమాటమున్నట్టు లేదు. వెంటనే ప్రారంభించాడు సంభాషణ చనువుగా. రెండు నిమిషాలయిందో లేదో, ఇద్దరికీ ఒక్కసారిగా గుర్తుకొచ్చింది, చిన్నప్పుడు కొవ్వూరులో కలిసి చదువుకున్నట్టు. ఇద్దరూ ఆశ్చర్యం, సంతోషం వెల్లడిస్తూ కొత్తతనం కాస్సేపటిలోనే మరిచిపోయారు. మూర్తి ఎదట రాధమ్మతో చనువుగా మాట్లాడడానికి సత్యం మొదట కొద్దిగా సంకోచించాడు, కాని రాధమ్మ మటుకూ ఎప్పటిలాగనే, చనువుగా 'మరి నీ ఫ్లూటు వాయిద్యం ఎప్పుడు వినిపిస్తావు ?' అంది.

సత్యంకూడా సంకోచం విడిచి 'మీరు హార్మోనియం వాయిస్తే నే కలిపి వాయిస్తాను' అన్నాడు నవ్వుతూ.

మూర్తికీ, సత్యానికీ రెండురోజులేనా కాకుండానే చనువూ, స్నేహమూ ఏర్పడ్డాయి. సత్యంతోనేకాక వాళ్ళింటివారందరితోనూ, పార్వతితోనూ

కూడా మూర్తికి చనువేర్పడడానికి కట్టేనోజులు పట్ట
లేదు. అసలు మూర్తితీరే అంత; తనకి నచ్చినవారితో
కలిసికట్టుగాఉండడం అతని స్వభావం. మూర్తి
వాళ్ళ కుటుంబంవారి నందరినీ కొవ్వూరులో ఉన్న
ప్పుడు బాగా ఎరిగివుండడాన్ని సత్యంతల్లి 'ఎంత పెద్ద
వాడవయావు మూర్తీ! లాగూ వేసుకోకుండా నువ్వూ
సత్యం ఆటలాడడం ఇంకా మొన్నమొన్నటిలాగని
పిస్తుంది!' అంటూ కుటుంబక్షేమం అడిగి తెలుసు
కొని సంతోషించింది.

మూర్తి కాశీలో యింజనీరింగు చదువుతు
న్నాడు. మొదటి సంవత్సరం పరీక్షలయి సెలవులకు
ఇంటికివచ్చి అక్కడినుంచి రాధక్కను చూడడానికి
వచ్చాడు. వారం రోజులే ఉందామని వచ్చినా,
సరదాగా ఉబుసుపోతుండటంవల్ల మూడు నాలుగు
వారాలవరకూ ఉండిపోయాడు. తేలికగా పత్రికలు
చదవడంతప్ప, అతనికి గ్రంథాలూ, తీవ్రధోరణి
చర్చలూ అంటే సాధారణంగా తలనొప్పి. పరీక్షలు
పేసై, ఉద్యోగం సంపాదించి యింజనీరుగా పేరు
పొందాలనీ, కుటుంబక్షేమం చూసుకుంటూ, సరదాగా
స్నేహితులతో కాలక్షేపం చెయ్యాలనీతప్ప మరే
ప్రత్యేకఆశయాలూ లేవు.

అయితే మంచి చొరవకలవాడే; కొంచెం సందడి

అయిన మేష్టరు. మధ్యాహ్నం సత్యంవాళ్ళింటివద్ద ఉంటే, పార్వతినికూడా పిలిచి, మూర్తి ప్రోత్సాహంతో ముగ్గురూ పేకాటో కేరమ్సో ఆడేవారు. భోజనాలవేళప్పటివరకూ ఎప్పుడేనావుంటే సత్యంతల్లి మూర్తినికూడా అక్కడే భోజనం చెయ్యమనేది. మూర్తి రవ్వంతేనా మొహమాటపడకుండా ఉండి పొయ్యేవాడు. 'అత్తయ్యగారూ, మీ ఆవకాయ బాగుంది' అంటూ అడిగి వేయించుకునేవాడు. కాస్త చనువేర్పడేటప్పటికి 'పార్వతీ, మీ ఇంట్లో కాఫీ బాగుంది, మరికొంచెం ఉంటే తీసుకురా' అని తెప్పి యించేవాడు కూడాను.

సత్యంవారింటి వారందరికీకూడా మూర్తి అంటే సరదావే. మితభాషి అయిన సత్యంనాన్నగారితో కూడా మూర్తి చనువుగా మసలడం సత్యానికి కొంచెం ఆశ్చర్యం వేసింది. సత్యానికిప్పటికీ వాళ్ళ నాన్నగారి ముందు కొంచెం జంకే. మూర్తి చనువుగా మసలినా, సత్యం నాన్నగారివద్దమటుకూ సందడి తగ్గించి చాలా పెద్దమనిషితరహాగా ఉండేవాడు.

సత్యంనాన్నగారికి మూర్తిఅంటే సరదా కలగ డానికి ఒక ప్రత్యేక కారణంకూడా వుంది. మూర్తి తండ్రికి ఇళ్ళప్లానులు వెయ్యడం హాబీ. ఎనిమిదివేల నుంచి ఇరవై ఎనిమిది వేలవరకూ ఖర్చుకాగల ప్లానులు

రెండుమూడు డజన్లేనా ఆయన తయారుచేశారు. ఇళ్ళ ప్లానుల పుస్తకాలు పది పన్నెండు తెప్పించారు. ఆయన ఉద్యోగంనుంచి విరమించాక, కాకినాడలోనో, విశాఖ పట్నంలోనో మంచి ఇల్లొకటి — అవసరమైతే ఒక భాగంకాని, రెండుభాగాలుకాని ఇబ్బందిలేకుండా అద్దెకివ్వడానికి వీలుగా — కట్టించాలని చాలాకాలంనుంచి ఉద్దేశం. మూర్తితోకూడా ఆ ప్లానుల గురించి ఎప్పుడేనా చర్చించేవారు. ఆ కారణంచేత ఇంజినీరింగు సంబంధమైన విషయాల్లో సహజంగా కొంత సరదా ఉన్నవాడవటంచేత ఇళ్ళప్లానుల విషయంలో మూర్తికీ కొంత భోగట్టా, కొన్ని ఉద్దేశాలూ వున్నాయి.

ఈమధ్యే సత్యంనాన్నగారికి కూడా కొంచెం ఆధునిక పంథాలో మరోఇల్లు కట్టించాలని కోరిక కలుగుతూంది. మూర్తినాన్నగారిని గురించి అడుగుతున్నప్పుడు సంభాషణలో ఇళ్లనిగురించికూడా ప్రస్తావన వచ్చింది. అప్పటినుంచీ, మూర్తి కింతచిన్న వయసులోనే గృహనిర్మాణంగూర్చి ఇంత భోగట్టా, ఇన్ని కొత్తకొత్త ఉద్దేశాలూ ఉండడంచూచి సత్యం నాన్నగారికి అతనంటే ప్రత్యేకాభిమానమూ, సదభిప్రాయమూ ఏర్పడ్డాయి.

మూర్తికి వాళ్ళ బావగారింట్లోకంటే హెచ్చు సేపు సత్యంవాళ్లింటివద్దనే కాలక్షేపం చెయ్యడం

సరదాగాఉన్నట్టుంది. సత్యానికిమటుకూ మధ్యాహ్నమప్పుడు కాస్తసేపైనా రాధమ్మగారింటివద్ద గడపాలని వుంది. పొద్దున్న సత్యంవాళ్ళింటివద్దనూ, భోజనాలయ్యాక కాఫీవేళవరకూ రాధమ్మగారింటివద్దనూ కాలక్షేపం చేసి, సాయంకాలం ఎక్కడుంటే అక్కడ రెండోసారికూడా కాఫీ పుచ్చుకొని తిరిగిరావడం; యిదీ మూర్తి, సత్యంయొక్క ప్రధాన కార్యక్రమం. పార్వతినికూడా హెచ్చరించి రాధమ్మయింటికి పేకాటకు తీసుకపొయ్యేవారు. పార్వతికీ సరదాగానేవుందీ కాలక్షేపం.

అప్పుడప్పుడు సత్యం సాధనచేసిన ట్యూన్స్, రాధమ్మ హార్మోనియంమీాదా, సత్యం ఫ్లూట్మీాదా కలిసి వాయించేవారు. ఉషారుగా ఉన్నప్పుడు వాయిద్యంతో తనగొంతు కాస్త మేళవించిపాడడమో, అక్కడనువుగావున్న పెట్టెమీాద మద్దెల వాయించడమో చేసేవాడుకూడాను మూర్తి. పార్వతి అది చూచి నవ్వితేమటుకూ కొంచెం సిగ్గుపడి, మూర్తి ఆ ధోరణి తగ్గించేవాడు. సినిమాలకికూడా అప్పుడప్పుడు రాధమ్మనీ, పార్వతినీ తీసుకుని వెళ్ళేవారు. జగన్నాధంగారినికూడా రమ్మని ప్రోత్సహించేవారు; కాని, ఆయన నవ్వి, 'చిన్నవాళ్లు మీారు సరదాగా వెళ్లిరండి. మళ్ళీ కాలేజీతెరిస్తే పైడూళ్లో చదువులూ అదిన్నీ'

అనేవారు. మొత్తంమీద మూర్తిరావడం అందరికీ సందడిగావుంది.

ఇంజనీరింగు చదవాలనుకుంటున్నాడు గనుక సత్యాన్నికూడా కాశీలోనే సీటుకి ప్రయత్నించమనీ, కాశీ విశ్వవిద్యాలయం, అందులో ముఖ్యంగా ఇంజనీరింగు కళాశాలా, హాస్టలువసతీ. భోజనం అంతా బాగుంటాయనీ, ఆరోగ్యమైన స్థలమనీ, అన్ని ప్రాంతాల వారూ, చాలామంది తెలుగు విద్యార్థులూ, వస్తారనీ మూర్తి మరీ మరీ చెప్పాడు. కాశీ ఇంజనీరింగు కాలేజీ ఆంధ్రవిద్యార్థిసంఘం ఆర్కెస్ట్రా బాగుంటుందట; కాలేజీ ఉత్సవాల్లో అంతా మెచ్చుకుంటూ ఉంటారుట; ఫ్లూటిస్టొక్కడే తగినవాడు లేడట, సత్యం వస్తే ఆలోటు తీరుతుందనికూడా చెప్పాడు!

మూర్తి అక్కడే చదువుతున్నందున సత్యం నాన్నగారికి, సత్యం కాశీలో చదవడం విషయమై సుముఖతగానేవుంది. పరీక్ష పేసై, ఇంజనీరింగులో సీటువస్తే ఇక పైఊళ్లోనే చదువుగనక, ఈ శెలవల్లో పిల్లలంతా సరదాగా గడపడం పెద్దవాళ్లకూ సంతృప్తిగా వుంది. కాలక్షేపం బాగా అవుతున్నందున మూర్తికి మరికొన్నిరోజులిక్కడే ఉండాలనివుంది; కాని, ఇంటి నుండీ అప్పుడే రెండుత్తరాలు రావడాన్ని ఇక వెళ్ళక తప్పిందికాదు.

మూర్తి వెళ్ళిపోవడం అందరికీ చిన్నబోయింది; పార్వతికి మరీను. సత్యానికీ అనిపించింది, కాని ఇది వరకువలె ఒక నిర్ణీతమైన దినకార్యక్రమం త్వరలోనే అలవరచుకొని ఓ నిశ్చింతావాతావరణంలో పడ్డాడు. అప్పుడప్పుడు స్నేహితులతో స్వేచ్ఛగా సరదాగా కాలక్షేపం చెయ్యటం సత్యానికి యిష్టమే; కాని నిర్విరామంగా అలా వేళపుచ్చడం అతనికి స్వభావం కాదు. వాళ్ళనాన్నగారివలెనే నిదానంతో కూడిన ప్రశాంతస్వభావ మతనిది. వేళానుసారమైన అల వాట్లూ, నిలకడగల ఉద్దేశాలూ, ఆశయాలూ అల వరచుకున్నవాడు. అందుచేత పొద్దున్నే లేవడం, కాస్త వ్యాయామం చెయ్యడం, పార్వతికి చదువు చెప్పడం, మంచిపుస్తకా లేవేనా రాత్రి కాస్త గదవడం, తోటపని చూచుకోవడం వీటిలో మళ్ళీ పడ్డాడు. భోజనాలయాక, మధ్యాహ్నం కాఫీవేళ లోపునముటుకూ రాధమ్మతో కబుర్లు చెప్పుకుంటూ కాస్త కాలక్షేపం చేసేవాడు.

ఎదురు చూస్తున్న పరీక్షాఫలితాలు వచ్చాయి. అనుకున్నట్టుగానే బాగా పేసయాడు సత్యం. రాధమ్మ తాను పేసైనంతగా సంతోషించింది. ప్రత్యేకంగా రాధమ్మనీ, జగన్నాధంగారినీ ఫలహారానికీ, రాత్రి భోజనానికీకూడా పిలిచారు, ముఖ్యంగా సత్యం

ప్రోత్సాహంవల్ల. జగన్నాధంగారుకూడా చాలా సంతోషించారు. ఇంట్లోవాళ్ళకు సంతోషంతోపాటు ఇక సత్యం చదువులకు పై ఊరు వెళతాడని కాస్త బెంగగాకూడా వుంది సత్యంనాన్నగారు. రాత్రి భోజనాలయాక అంతా విశ్రాంతిగా కూర్చున్నప్పుడు సత్యంతో, త్వరలోనే తమని విడిచి పై ఊరు వెళతాడని కాబోలు, సాధక బాధకాలు హెచ్చుగా మాట్లాడుతూండేవారు. సీట్లకు వివిధ కళాశాలలకు దరఖాస్తులు పెట్టడం అదీ మొదలెట్టాడు సత్యం. మొత్తానికి ప్రయత్నంమీదనూ, అదృష్టంకూడా కలిసివచ్చిన్నీ కాశీలో యింజనీరింగుసీటు లభించింది. చూస్తూండగానే కాలేజీ తెరచేరోజులు దగ్గరపడ్డాయి. ప్రయాణ సన్నాహాలారంభమయాయి. సత్యానికి ఇష్టమైన ఫలహారాలు వాళ్ళమ్మ చేసేది. రాధమ్మకూడా రెండు మూడుసార్లు ఫలహారాలు చేసి పంపింది. సీటువస్తే, ఇద్దరూ కలిసే ప్రయాణం చేద్దామనుకున్నారు గనుక, ఏరోజు బయలుదేరేదీ మూర్తికి తెలియచేస్తూరాశాడు.

మరునాడే ప్రయాణం. ఇన్నాళ్ళు ఇల్లు విడిచి పై ఊరు వెళ్ళడానికి సత్యానికిదే ప్రథమం. పెద్దవాళ్ళనూ, పార్వతినీ, రాధమ్మనూ విడిచివెళ్ళడం అంటే అతనికీ ఆరాటంగానే వుంది. ఈ వారంరోజులూ కుటుంబంలోనివా రందరితోనూ, రాధమ్మతోనూ

ఆత్మీయంగా తరుచుగా కూర్చుని మాట్లాడుతూ కాల క్షేపం చేశాడు. రేపే ప్రయాణమంటే, దృష్టి ప్రత్యేకంగా రాధమ్మవేపే ఆకర్షింపబడుతూంది. మధ్యాహ్నం ఆమెను కలుసుకున్నా, సూర్యాస్తమయ వేళప్పుడు తిరిగీ జాంవిచెట్టుకేసి వెళ్ళాడు. చెట్టుక్రింద బరువైన తీయని స్మృతులతో పరధ్యానంగా చూస్తున్నాడు. రాధమ్మ వచ్చి సన్నగా నవ్వి గోడనానుకుని నిలబడింది. వారట్టే సంభాషించలేదు. చెట్టుదిగి వెళ్ళేటప్పుడు రాధమ్మ 'తరుచు క్షేమసమాచారాలు తెలియచేస్తూ ఉత్తరాలు ఇంటికి రాస్తూండేం? నీ మీదే ధ్యాస' అంది. 'అలాగే, రేపు వెళ్ళేటప్పుడు కనిపిస్తాను' అన్నాడు.

సత్యం, మూర్తితో కూడా కాశీచేరాక హాస్టలు నుండి తరుచుగానే ఉత్తరాలు రాస్తున్నాడు. సాధారణంగా పార్వతిపేర వ్రాస్తూ, 'రాధమ్మగారింట్లో అంతా బాగున్నారని తలుస్తాను' అనో, జ్ఞాపకం చెయ్యమనో రాస్తూండేవాడు. రాధమ్మ ఎంతో సంతోషించేది. సత్యం, మూర్తి అక్కడ కులాసాగా ఉన్నట్టు వినడానికి చాలా సంతోషంగా వుందనీ, ఇద్దరినీ అడిగాననీ పార్వతిని ఉత్తరం వ్రాసేటప్పుడు వ్రాయమనేది. సత్యం వెళ్ళినతరువాత పార్వతికి రాధమ్మతో చనువు హెచ్చింది.

సత్యం శ్రద్ధగా పెంచిన పూలతోటను పార్వతి కూడా ఆసక్తితో పోషిస్తూంది. 'పూలమొక్కలు బాగున్నవా, అప్పుడప్పుడు చూస్తున్నావా? పాఠాలు బాగా వస్తున్నాయా?' అని కూడా పార్వతికి రాసే వాడు. ఎప్పుడేనా ఉత్సాహంగా హాస్టలు విశేషాలూ, భోజనాలగురించీ, మూర్తి గురించీ, తోడి విద్యార్థుల వేడుకలూ, విశ్వవిద్యాలయ ఉత్సవాలూ – అన్ని సంగతులతో పెద్ద ఉత్తరం వ్రాసి, పార్వతినికూడా అన్ని సంగతులతో పెద్ద ఉత్తరం వ్రాయమనేవాడు.

దసరా సెలవలకు ఇంటికి వస్తున్నట్టు వ్రాయ గానే అతని రాకకై అంతా ఎదురు చూడసాగేరు. సత్యాన్ని కలుసుకోడానికి వాళ్ల నాన్నగారూ, పార్వతీ కూడా స్టేషనుకు వచ్చారు. ఈ నాలుగు నెలల్లోనే సత్యం యింకా ఎదిగి కొద్దిగా మారినట్టుపించాడు. ఇంటికి వెళ్లేటప్పుడు త్రోవలో 'అమ్మా, అమ్మమ్మా బాగున్నారా?' అని పార్వతి నడిగి కొంచెం మొహ మాటపడుతూ మెల్లిగా 'రాధమ్మా అంతా కులాసాగా ఉన్నారా?' అనికూడా అడిగాడు.

స్నానం భోజనాలయేటప్పటికి రాధమ్మ అక్క డికి వచ్చింది. 'అప్పుడే ఇంజినీరురూపు వచ్చేసిందే' అంటూ సత్యాన్ని నవ్వుతూ పలకరించింది. 'నేనే వద్దామనుకుంటూంటే మీరే వచ్చేశారే' అంటూ

సత్యంకూడా నవ్వాడు. కాశీవిశేషాలూ అవీ వింటూ అంతా సరదాగా సంభాషించారు. సత్యం బాగా వున్నాడనే అందరూ అనుకున్నారు; వాళ్ళమ్మమ్మ మటుకూ, ఇదివరకు కాశీయాత్ర చేసినావిడ, 'గంగా తీరపు గాలీ, నీరూ ఆహా చెప్పేదేమిటి, అన్నింటికీ దివ్యౌషధం. కాని, హోటేలుభోజనం యింటివద్దున్నట్టు సుష్టుగావుంటుందా ఏఁవన్నానా? ఒళ్ళు తీసిపోదూ మరి. ఏమిరా బాబూ, అన్నమేవండుతారా, ఆ రొట్టెముక్కల భోజనమేనా?' అంది పూర్వకాలపు ధోరణిలో.

సత్యం నవ్వుతూ, 'ఒళ్ళు తీసిపోవడమేమిటి, వెళ్ళినప్పటికంటే బరువు హెచ్చాయాను! హోటేలు భోజనంకాదు అమ్మమ్మా, యింటిభోజనంకంటే సుష్టుగా వుంటుంది. రొట్టే, అన్నమూకూడా తింటా మక్కడ. అక్కడి మహరాజ్ లందరూ — వంట బ్రాహ్మలను మహరాజ్ లంటారులే — చారూ, సాంబారూ, ఇడ్డెనూ, దోసే మనవంటలన్నీ చేయడం నేర్చుకున్నారు. ఇక్కడకూడా అన్నంతో రెండు గోధుమ రొట్టెలుతింటే బాగుండుననిపిస్తుంది' అన్నాడు.

వచ్చి మూడు నాల్గు రోజులైంది. అవాళ సాయంకాలమప్పుడు, ఉత్తరాదిమోస్తరుగా గోధుమ రొట్టెలూ, బంగాళాదుంపలూ, గుమ్మడికాయా,

వంకాయా కలిపి తేజ్‌పత్రి వగైరా మసాలాతో రస్ తర్కారీ, చేద్దామని సత్యం పార్వతిని ప్రోత్సాహపరచి వంటింటివసారాలో వంటప్రయత్నంలో వున్నాడు. వాళ్ళమ్మ సామగ్రులు సమకూర్చి సాయంచేదామని వచ్చి కూర్చుంది. సత్యంమటుకూ ఉత్సాహంతో 'నేనూ, పార్వతీ తయారుచేసెయ్యగలములే' అంటూ పనిలో నిమగ్నుడయ్యాడు. వాళ్ళమ్మ నవ్వి 'అయితే సరే, మీరిద్దరే వండుకుందురుగాని; ఏదేనా అవసరముంటే పిలవండి' అని వెళ్ళిపోయింది.

ఇంతలో రాధమ్మ వచ్చి, సంగతి సత్యంతల్లివల్ల విని, 'కాశీవంటకాలు యిద్దరూ తయారు చేస్తున్నారూ' అంటూ వసారాలోకి నవ్వుతూ వచ్చింది. ఆమె చాలా విషయాల్లోలాగునే వంటలోకూడా నేర్పరి. ఇతరప్రాంతాల వంటకాలుకూడా ఆమాత్రం తెలుసును. ఆమె రావడం సత్యానికీ, పార్వతికీకూడా సరదాగా వుంది. ఆమెసహకారంతో మొత్తానికి రొట్టెలూ ఘుమఘుమలాడే కమ్మని వాసనతో కూరా బాగా తయారయ్యాయి. వాళ్ళమ్మకి మడీ, ఆచారమూ గనుక తినదు; కాని వాళ్ళమ్మా, నాన్నగారికోసం యింత జాగ్రత్తగా అట్టేపెట్టి, రాధమ్మను మొహమాటపెట్టి, ముగ్గురూ ఫలహారంచేశారు. ఫ్లాస్కులో వున్న కాఫీకూడా సేవించి, డాబా మీదకి వెళ్ళారు.

సత్యం ఈమధ్య నేర్చుకున్న రెండుమూడు కొత్త ట్యూనులు ఫ్లూట్ తీసుకొని వాయించాడు. సంధ్యవేళ వరకూ సరదాగా కాలక్షేపం అయింది.

రాధమ్మ వెళ్ళినతరువాత సత్యానికి జ్ఞాపకం వచ్చి, నాల్గు చపాటీలూ, యింతకూరా జాగ్రత్తగా ఆకులో పొట్లంకట్టి, జావిచెట్టెక్కి 'రాధమ్మగారూ' అని పిలిచాడు. ఆమె ఆశ్చర్యపడి 'ఏం సత్యం?' అంటూ గోడవద్దకు వచ్చింది. 'మరిచిపోయాను; మరి జగన్నాథంగారుకూడా రుచి చూడవద్దూ, మనం తయారుచేసినవి? ఇదిగో తీసుకోండి. శుభ్రమైన బట్టలతోనే చేశాంకదా, ఆయనకు మడిఅయితే చెప్ప లేను కాని' అన్నాడు సత్యం, నవ్వుతూ. రాధమ్మ మనసు అవ్యక్తానందంతో నిండిపోయింది. ఈ స్వల్ప కార్యంలోనే సత్యంయొక్క నిస్వార్థత, అమాయకత్వం బంధుమిత్రవర్గం ఎడల అతనికుండే సమానమైన ఆప్యా యత ఆమెకు గోచరించాయి. 'ఇందుకోసం పనిపెట్టుకు వచ్చావా, మంచివాడివే! నాకూ, ఆయనకూ మరీ అట్టే మడీ, ఆచారమూ లేవులే. చాలా సంతోషిస్తారు. కాని, జాగ్రత్తగా దిగు సుమీ, చీకటిపడుతూంది' అని హెచ్చరించింది.

అవాళ రాత్రి భోజనాలప్పుడు, రాధమ్మ చపా టీలూ, ఉత్తరాదితరహా కూరా కూడా జగన్నాథం

గారికి సంగతులు చెబుతూ వడ్డించింది. రాఘవమ్మ అన్నట్టుగానే, ఆయన సంతోషానికి మేర లేకపోయింది. సత్యమంటే మొదటినుంచిన్నీ ఆయన కభిమానమూ, సరదా ఉంటూవచ్చింది. అది నానాటికీ వృద్ధి అవసాగింది. 'చాలా బాగాచేశారు. చూశావా అబ్బాయి బుద్ధీ, చురుకుతనమున్నూ. ఆ కుటుంబమే అటువంటిది. భగవంతు డాశీర్వదించి — చూడు, చెబుతున్నా — మంచివృద్ధిలోకి వస్తాడు. అటువంటి అబ్బాయి ఒక్కడు చాలడూ, రత్నంలా వంశానికి వెలుగు తీసుకురావడానికీ? తలిదండ్రుల కింతకన్నా ఆనందవిషయ మేముంటుంది? ఆహా, ఎంత పుణ్యంచేసుకోవాలి!' అంటూ తమకూ అటువంటి కుఱ్ఱవాడు లేకపోయెనే అనే ధ్వనితోకూడిన భావలోలత్వంలో, ఏమేమో చెప్పసాగారు.

సత్యాన్ని ఆతరువాత కలుసుకున్నప్పుడు అభినందిస్తూ మాట్లాడి, కాశీవిశేషాలన్నీ అడిగారు. జగన్నాథంగారు తను తల్లినికూడాతోడ్కొని ఇదివరకు ప్లీడరుగారి కుటుంబంతో చిదంబరం, శ్రీరంగం, మధుర, రామేశ్వరం వగైరా దక్షిణాదియాత్రలన్నీ చేశారు. తిరుపతి, భద్రాచలం, సింహాచలంకూడా దర్శించారు.

ఆసంగతులు సత్యంతో చెబుతూ 'హరిద్వారం, బదరీనాథం, కేదారనాథం దర్శించే ఆశా లేదూ, అవ

కాశమూ లేదు. కాని గంగాస్నానంచేసి, కాశీ విశ్వేశ్వరుణ్ణి దర్శించి తిరుగుప్రయాణంలో పూరీజగన్నాథుణ్ణికూడా సేవించాలని సంకల్పంమటుకూవుంది, ప్రాప్తివుంటే. నువ్వూ, మూర్తీ అక్కడవుండగానే రావాలనివుందోయ్ అల్లుడూ, కాశీకి' అన్నారు. సత్యం. ఉత్సాహంతో 'తప్పకుండా మీరూ, రాధమ్మగారూ కలిసిరావాలి. వచ్చేముందుమటుకూ తెలియచేస్తూ రాయండి. మీ సదుపాయాలన్నీ అక్కడ మేం చూస్తాంకదూ' అన్నాడు. సత్యం ఉత్సాహానికీ, ఆదరపూర్వకమైన ఆహ్వానానికీ రాధమ్మా, జగన్నాధంగారూకూడా ముచ్చటపడ్డారు. 'కాలం కలిసిరావాలి కదా. నస్తాములే మీరిద్దరూ అక్కడ ఉండగానే; యింకా మూడేళ్లవరకూ అక్కడ చదువులున్నాయి కదా' అన్నారు జగన్నాధంగారు.

ఒక్కొక్కప్పుడు తలుచుకుంటే కాలం చాలా చిత్రగతిలో నడుస్తున్నట్టుంటుంది. నెలరోజుల సెలవులూ యిట్టే గడిచిపోయాయి. అలాగే సరదాగా గడిచిపోయాయి కాశీలో రెండు సంవత్సరాలున్నూ; దసరా, వేసవి సెలవల్లో యిదివరకువలెనే యింటివద్ద కులాసాగా కాలక్షేపం అవుతూవస్తూంది.

సత్యానికిప్పుడు యిరవై ఒకటో సంవత్సరం. పై ఊళ్లో నివాసమూ, ఈ మూడు నాలుగేళ్ల నూతి

నానుభవమూ అతనిలో కొంత మార్పు కలుగచేశాయి. ఆత్మవిశ్వాసమూ, నవయౌవన చిహ్నములూ బాగా దృఢపడ్డాయి. ఆకర్షణీయమైన తీరూ, ఒకవిధమైన పక్వదశా అతనిలో ప్రతిఫలిస్తున్నాయి. కాని, ఆదరాభిమానములలోనూ, చక్కని ఆశయములలోనూ సత్యం ఏమీ మారలేదు. చదువూ, టెన్నిస్, ఆటపాటలందు శ్రద్ధాసక్తులతో, ఆరోగ్యమైన విద్యార్థి వర్చస్సుతో రాణిస్తున్నాడు. ఈ రెండు సంవత్సరాలూ ఇంటినుండి పంపే సొమ్ము అనవసరఖర్చులు చేయకుండా వాడుకుంటూ, అందులో మిగిల్చిన మొత్తముతో కెమేరా కొన్నాడు. మూర్తి కిదివరకే కెమేరా వుంది. వాళ్లిద్దరూ అచటి దృశ్యాలూ, తోడి స్నేహితులవీ వగైరా, పెద్ద ఆల్బమ్ పట్టేవన్ని ఫొటోలు తీశారు ఈ వేసవి సెలవల్లో మళ్ళీ మూర్తి కూడా రాధక్కవద్దకు వచ్చాడు.

పార్వతికిప్పుడు పదహేడో ఏడు. ఈ సంవత్సరమే స్కూల్ ఫైనల్ పరీక్షకు వెళ్ళింది. పొడుగ్గాఎదిగి నాజూగ్గా, ఆకర్షణీయంగా కనిపిస్తూంది. రెండేళ్ళ తరువాత ఈమారు మొదటిసారి మూర్తి వాళ్ళింటికి వచ్చినప్పుడు మునపటిలాగా చనువుగా ఉండడానికి మొహమాటపడింది. మూర్తి అది గమనించాడో

లేదో కాని, వస్తూనే పార్వతిని పూర్వంవలెనే పలక
రించి, సందడిగా మామూలుధోరణి ఆరంభించాడు.

అతను వచ్చేప్పటికి సత్యం ఫొటో ఆల్బమ్ పార్వ
తికి చూపిస్తున్నాడు. మూర్తి అదిచూచి, 'సత్యం
ఆల్బమ్ చూశావుకదా, మరి నా ఆల్బమ్ కూడా
చూద్దువుగాని; ఎవరిది బాగుందో చెప్పాలి. భోజనం
చేశాక అక్కడికి వస్తారుకదూ? పేకాట వేద్దామా?
వచ్చేప్పుడు ఫ్లూట్ కూడా తీసుకురాసుమీ సత్యం' అని
ఎప్పటి చనువుతో పార్వతి నుద్దేశించి 'కాఫీ ఏమన్నా
వుందా? చిక్కగా ఉండాలి సుమీ! మీయింట్లో కాఫీ
ఫ్లేవర్ ఎప్పుడూ బాగానేవుంటుందిలే' అంటూ పురమా
యించాడుకూడాను. నిజానికి మూర్తి స్వభావ మెటు
వంటిదంటే—అతనికెవరివద్దనూ ఆట్టే మొహమాటమూ
లేదు; అతని సాంగత్యంలో ఎవ్వరూ మొహమాటపడే
అవకాశమూ కలగనివ్వడు. ఆ కారణంచేతనూ,
యింట్లో అందరూ మూర్తిని కుటుంబంలోని అబ్బాయి
వలెనే చనువుగా చూస్తున్నందువల్లనూ, పార్వతి
మొహమాటంగా మసలడానికి అంత అవసరమూ అవ
కాశమూ కూడా కలుగలేదు.

సెలవల్లో చాలా సరదాగా కాలక్షేపం అవు
తూంది. మొదటి వారంరోజులూ ఫొటోలుతియ్యడం

కూడావిడి హెచ్చుగావుంది. వేరువేరుగానూ, గ్రూప్ ఫొటోలూ విరివిగాతీశారు. రాధమ్మగారింట్లో ఫొటో తీసినరోజున, జగన్నాధంగారు నవ్వుతూ, 'పిన్న వయసులో ఉన్నవారంతా కలిసితీయించుకుంటే గ్రూప్ ఫొటో బాగుంటుందికాని వయసుమీరిన నావంటి వాడితో ఏంబాగుంటుందిమూర్తీ, నీ ఆల్బమ్‌కి? ఎలా తీయడమోచెప్పు; మీ నలుగురికీ ఒకటి నే తీస్తాను' అని, రాధమ్మా, మూర్తీ, సత్యం, పార్వతీ—నలుగురినీ కూర్చోమని ఫొటోతీశారు. ఇక పార్వతిఫొటోలు, నిల్చునీ, చెట్టుకింద పడకకుర్చీలో కూర్చొనీ, చదువు కుంటూనూ, అనేకతీరుల్లో అధమం ఓ డజనుఫొటో లేనా తీసివుంటాడు మూర్తి.

అవాళ మధ్యాహ్నమప్పుడు రాధమ్మఇంటివద్ద, మూర్తిఆల్బమ్‌లు నలుగురూ చూస్తున్నారు. ఒక ఆల్బమ్‌లో అన్నీ ఫొటోలేవున్నాయి; రెండోదాంట్లో ఇలస్ట్రేటెడ్ వీక్లీ నుంచీ, అటువంటివే యితర దేశపు పత్రికలనుంచీకూడా ఏరికూర్చిన నూతన వధూవరుల చిత్రా లున్నాయి. మూర్తి కుతూహలం అమాయ కపుసరదాల్లో యిదొకటి. ఆవధూవరుల చిత్రాలన్నీ అందంగా, ఆకర్షణీయంగావున్నాయి. పార్వతి పేజీలు తిరగవేస్తూంది. రాధమ్మా, సత్యం, మూర్తీకూడా చూస్తున్నారు. 'వరునికంటె వధువే బాగుంద'నో,

'వధువుకంటె వరుడే బాగున్నా'డనో, సరదాగా మధ్య మధ్య వ్యాఖ్యానిస్తున్నారు.

ఆఖరు రెండు పేజీల్లో చిత్రాలు లేవు; కాని, ఎడమవేపు పేజీలో పార్వతిఫోటో, కుడివేపు పేజీలో మూర్తిఫోటో వున్నాయి. అవి చూడగానే సత్యం నవ్వుతూ, 'ఇదేవిటిరోయి మూర్తీ, ఈ ఆల్బమ్‌లో ఆఖరున మీ ఫోటోలేమిటి! భలేవాడివే' అన్నాడు. రాధమ్మకూడా నవ్వింది. పార్వతిచెక్కిళ్ళు లజ్జతో ఎఱ్ఱపడ్డాయి. మూర్తి మరింత సిగ్గుతో, 'అబ్బే, బాగా వచ్చాయని ఖాళీగావుంటే యివి ఆఖరికి అంటించాను. నీదీ, మరేవేనాకూడా పక్కని అంటిద్దామనీ' అన్నాడు, తడబడుతూ. నిజానికి మూర్తి, పాపం, ఏ ప్రత్యేకోద్దేశమూ లేకుండానే ఆఫోటోలు ఆ ఆల్బమ్‌లో వుంచాడు. సత్యం నవ్వేవరకూ అతని కది విడ్డూరంగా వుంటుందేమోననే సంగతి స్ఫురించనేలేదు. అకస్మాత్తుగా స్ఫురించి చాలా సిగ్గుపడ్డాడు.

కాఫీ తాగినతరవాత, వధూవరుల చిత్రాలున్న ఆల్బమ్ చూచి, పార్వతి ముచ్చటపడ్డదని తెలుసుకొని మూర్తి ఆమెనది తీసుకోమన్నాడు. పార్వతి మొహమాటపడడం చూచి 'ఇంకా నావద్ద అటువంటివే రెండున్నాయి. తప్పకుండా తీసుకోవాలి' అంటూ యిచ్చాడు. మూర్తి ఓసారి సత్యంతో 'సెలవల్లో

ఇక్కడికి ప్రతిసారీ నేనే వస్తున్నాను. నువ్వూ, పార్వతీ మాతోనోసారి రాకూడదూ?' అన్నాడు. పార్వతీ, రాధమ్మా అప్పు డక్కడే వున్నారు. సత్యం 'ఈమాటు వస్తాంలే' అనేవాడు, మామూలుగా. పార్వతికి పెద్దవాళ్ళు వివాహం తలపెట్టే వయసు వచ్చిందనీ, త్వరలోనే జరగడం సంభవమనీ సత్యానికి తెలియక పోలేదు. కాని, ఆశ్చర్యమేమిటంటే, మూర్తికీ, పార్వతికీ ఒకరిఎడల ఒకరికి యౌవనసహజమైన అనురాగబంధం పెరుగుతున్నదేమో అనే విషయమై యిసుమంతైనా అతని దృష్టి పోలేదు. రాధమ్మమటుకూ ఈ విషయం బాగానే అవగాహన చేసుకున్నది.

తిరిగి కాశీ వెళ్ళేముందు సత్యమూ, మూర్తీ కూడా జగన్నాథంగారిని తప్పకుండా కాశీ రమ్మని చెప్పారు. 'మూర్తిది ఆఖరు సంవత్సరం; మరే ఆటంకమూ లేకపోతే, నేనుండేదీ యిదికాక మరొక్క సంవత్సరం. పూజా సెలవలముందు వస్తే బాగుంటుంది. అట్టే చలీ వుండదు మరీ గాడ్పుగానూ వుండదు. ప్రయాగకూడా వెళ్ళి అంతాకలిసే తిరిగిరావచ్చును. మీరు ముందు సిద్ధపడితేతప్ప జగన్నాథంగారు ప్రయాణం మొదలెట్టేటట్టులేదు' అన్నాడు సత్యం నవ్వుతూ, రాధమ్మ నుద్దేశించి. వాళ్ళ ఆప్యాయతకి రాధమ్మా, జగన్నాథంగారూకూడా చాలా ఆనం

దించారు. తప్పకుండా వస్తామన్నారు జగన్నాథంగారు ఉల్లాసంగా.

కాశీ వెళ్ళాక ఈ మూడోసంవత్సరం తొలి రోజుల్లోనే సత్యానికి అనుకోకుండానే ఓ సంఘటన జరిగింది. విశ్వవిద్యాలయంలో లెక్చరరుగా వుంటున్న ఒక ఉత్తరాదిఆయన అబ్బాయి సత్యంసహాధ్యాయీ, స్నేహితుడున్నూ. ఆ స్నేహపరిచయంమూలాన్ని, సత్యాన్ని వాళ్ళింటికి కప్పుడప్పుడూ పిలుస్తూండేవాడు.

పొరుగునవున్న మరొకరిద్దరు అధ్యాపకులతో కూడా సత్యానికి పరిచయమయింది. అందులో ఒకాయన చరిత్రశాఖలో పనిచేస్తున్నారు; బాతాఖానీ ప్రియుడు. ఆంధ్రులగురించీ, దక్షిణాది ఆచార వ్యవహారాలగురించీ సత్యంతో అప్పుడప్పుడూ చర్చిస్తూండేవారు. సత్యంఎడల ఆయన కభిమానమూ, సదభిప్రాయమూ కలిగాయి. ఆయన కుమార్తె మెట్రిక్ కు చదువుతూంది; కుఱ్ఱవాడు దిగువక్లాసులో వున్నాడు. వారిద్దరికీ ఇంగ్లీషూ, లెక్కలూ శాస్త్ర చెప్పడానికి తగిన ట్యూటర్ కోసం చూస్తున్నారు.

సంశయిస్తూనే ఓరోజు సత్యంతో ఈ విషయమై ప్రస్తావించారు. సత్యం ఆశ్చర్యపడ్డాడు. అతనికి ట్యూషన్లు చెప్పిఆర్జించుకోవలసిన ప్రత్యేకవసరమేమిన్నీ లేదు. తాను చెప్పడం విడ్డూరంగా వుంటుందేమోననే

ఊహా తాత్కాలం తట్టింది. లెక్చరరుగారది గమనించి, 'నీకవసరముందని ఎంతమాత్రమూ కాదు సుమీ, నేనీ విషయం ప్రస్తావించడం. చెప్తామనేవాళ్ళు వున్నారు; కాని తగినవాళ్ళు దొరకడమే కష్టంగా వుంది. నీ చదువుకు యిబ్బంది లేకపోతే, నీకు సదుపాయమైనవేళ, రోజూ ఒక్కగంట చెబితే చాలు. నీకభ్యంతరం లేకపోతేనే సుమీ. నేను అమెరికాలో చదివేటప్పుడు తీరికసమయాల్లో ఏవేనా పనులుచేసి కాస్త ఆర్జించేవాణ్ణి. అమెరికాలో చాలామంది అలా చేస్తారు. ఇందులో తప్పేమీ లేదు. నేనే కాస్తకూచుని చెబుదామంటే కుదరడంలేదు; పిల్లలకా శ్రద్ధావుండదు. నీకంగీకారమైపిలుపడితే చాలా సంతోషిస్తాను. ఏతో పుచ్చుకునే చెప్పాలి. ఆలోచించి ఏది నిశ్చయించేదీ రేపు తెలియచెయ్యవచ్చులే' అన్నారు.

సత్యం ఇంకా ఆశ్చర్యంతోనే 'సరే, రేపు తెలియచేస్తాను. నాయందు సదభిప్రాయమున్నందుకు చాలాసంతోషం. లెక్కలంత పరవాలేదుకాని ఇంగ్లీషు మెట్రిక్ చదివేవాళ్ళకు ఇంటరేపేసైనవాణ్ణి చెప్పగలనంటారా? నే నిదివరకెప్పుడూ ఎవరికీ ట్యూషన్ చెప్పలేదు, ఎప్పుడేనా చెల్లెలికి చెప్పడంతప్పిస్తే' అన్నాడు వినయంగా. లెక్చరరుగారు నవ్వుతూ, 'చెప్పేసమర్థత నీకు తప్పకుండావుంది. నీతో పరిచయం

అయి, నాలుగైదుసార్లు సంభాషించేసరికే తెలిసింది. రేపు తెలియచేస్తావుకదూ ?' అన్నారు.

సత్యం అంగీకరించడానికి ముఖ్యకారణం ఏమిటంటే, తాను స్వయంగా పార్వతికి మంచి రిస్టువాచీ కొని బహుమతిగా యివ్వాలనే అభిలాష ఈమధ్య కలగడం. డిసెంబరుమాసాంతంవరకూ సాయంకాలం ఆటలయ్యాక, షికారుగావచ్చి ఓ గంట చెప్పేందుకు వప్పుకున్నాడు. మూర్తితోకూడా చెప్పాడు. తన వారికిమటుకూ తెలియచేయ వద్దన్నాడు. ఇంగ్లీషు, లెక్కలేగనుక అతని కేమంత శ్రమకాని, చదువు కిబ్బందికాని కలుగలేదు.

పూజాసెలవులిచ్చే ముందురోజునే జగన్నాథం గారి వద్దనుంచి ఆయనా, రాధమ్మా గయ దర్శించి, రెండురోజుల్లో వస్తున్నట్టు ఉత్తరంవచ్చింది. సత్యం, మూర్తీ చాలా ఉషారుగా వున్నారు. సెలవులకు హాస్టెల్లోగదులు ఖాళీఅవుతాయికదా, వార్డెన్ అనుమతి అడిగి హాస్టెల్లోనే దింపుదామా అని ఆలోచించారు. చాలామంది విద్యార్థులు ఇళ్లకు వెళతారు గనుక మరీ సందడిగాకూడా వుండదనుకున్నారు. వార్డెను నడిగితే తన కభ్యంతరం లేదనీ, కాని, అతిథిగృహంలో అయితే హెచ్చు సదుపాయంగా ఉంటుందేమోననీ అన్నారు.

స్టేషనుకి ఇద్దరూ వెళ్లారు. రాధమ్మా, జగన్నాథంగారూ చాలా సంతోషించారు. విశ్వవిద్యాలయంలోనే బసచేయవచ్చునని సత్యం, మూర్తీ చెప్పారు. కాని, జగన్నాథంగారు గంగఒడ్డునే విశ్వనాథుని ఆలయానికి సమీపంలో ఏదేనా మంచి సత్రంలో బస చేయడాని కిష్టపడ్డారు. బస చూచుకోవడం, గంగాస్నానం, అన్నపూర్ణ, విశ్వేశ్వర దర్శనం, తరువాత భోజనం అన్నిసదుపాయాలూ, మూర్తీ, సత్యం బాగా కనుక్కున్నారు.

రెండురోజులూ వీరితోనే కాలక్షేపం చేశారు. ఒకరోజు వివిధఘట్టాలూ, మరోరోజు విశ్వవిద్యాలయం, అన్నీ ఓపికగా చూపించారు. నావమీద గంగాతీరపు దృశ్యాలన్నీ చూస్తూ షికారుచేశారుకూడాను. సత్యం, మూర్తీ పట్టుపట్టి ఒకపూట వాళ్ల హాస్టల్లో భోజనం ఏర్పాటుచేశారు. సెలవలవడాన్ని సందడి అంతగా లేదు. కాని ఉన్న విద్యార్థులు ఉషారుగానే వున్నారు. మొత్తానికి మర్యాద కెట్టిలోపమూ లేకుండా, చాలా గౌరవంగానే అన్నిసదుపాయాలూ, సౌకర్యాలూ చూచారు, హాస్టల్లోనివారుకూడా. చాలా సరదాగా గడిచిపోయాయి రెండురోజులున్నూ.

తరువాత ప్రయాగకూడా అంతా కలిసివెళ్లి, కలకత్తామీదుగా వస్తూ భువనేశ్వరంలో దిగి, అక్కడ

లింగరాజస్వామి ఆలయం మొదలైనవి దర్శించి, ఖండ గిరి గుహలూ, నగరదృశ్యాలూకూడా చూచి, పూరీ చేరారు. జగన్నాథ దర్శనంకూడా చేశారు. జగన్నాథంగారి చిరకాల ఆశయం నెరవేరింది. ఇంత సదుపాయమైన ప్రయాణం, యింత సరదాఅయిన యాత్రా ఎప్పుడూ జరగలేదని రాధమ్మా, జగన్నాథం గారూకూడా ఎంతో ఆనందించి, మెచ్చుకున్నారు. అంతా కలిసి స్వస్థలానికి ప్రయాణమయ్యారు.

సత్యం తాను జాగ్రత్తచేసిన సొమ్ముతో వాళ్లమ్మకూ, పార్వతికీ, రాధమ్మకూ మూడు శాంతిపురం చేనేతచీరెలూ, అమ్మమ్మకో పొత్తుపంచె, నాన్నగారికీ, జగన్నాథంగారికీ నాణ్యమైన చేతికఱ్ఱలూకూడా కొని తీసుకువచ్చాడు. ఈ సంగతి ఇంటికివచ్చేవరకూ రాధమ్మకూ, జగన్నాథంగారికీ తెలియదు. మూర్తి కోసం ఖరీదైన ఆల్బమ్‌కూడా ఒకటి కొన్నాడు. అందరూ ఎంతో సంతోషించారు. సత్యంనాన్నగారిది ఆనందాన్నికాని మరేభావాన్నికాని అట్టే వెల్లడిచేసే స్వభావంకాదు. ఆయన ఆశ్చర్యానందాలతో 'జ్ఞాపకం ఉంచుకుని అందరికీ తెచ్చావే, బాబూ! నీ సదుపాయా లేవీ తగ్గించుకోవడం లేదుకదా? పైఊళ్ళో యిబ్బం దెప్పుడూ పడకూడదు. పంపేసొమ్ము సరిపోతూందా? మొహమాటపడకుండా తెలియచేస్తూండు' అన్నారు.

ఇక రాధమ్మ, జగన్నాధంగారి ఆనందానికి మేర లేదని చెప్పనక్కర లేదు. దసరా సెలవలు ఈమాటుకూడా హాయిగా గడిచాయి.

ఈమారు తిరిగి కాశీ వెళ్ళాక, ఈ మూడో సంవత్సరం వేసవి సెలవల్లో సత్యం యింటికిరా లేదు. కొంతమంది తోడివిద్యార్థులూ, అధ్యాపకులతో కలిసి సత్యం, మూర్తి కాశ్మీరు వెళ్ళారు. అక్కడ మూడు వారాలు గడిపి మూర్తీ, మిగతావారంతా ఇళ్లకు బయలుదేరారు. సత్యం, అతని సహాధ్యాయిఅయిన స్నేహితుడొకతనూ మాత్రం, తోడి విద్యార్థిఅయిన ఒక కాశ్మీరు నివాసుని ప్రోత్సాహంతో, మిగతా సెలవులుకూడా కాశ్మీరులోనే గడిపారు.

మూర్తిచదువు పూర్తిఅయినందున, ఆఖరు సంవత్సరంలో అతని సన్నిహిత సహవాసం లేకపోవడం సత్యానికి వెలితిగానేవుంది. మూర్తి తో ఉత్తర ప్రత్యుత్తరాలుమటుకూ తరచుగానే సాగుతున్నాయి. పరీక్ష పేసైన కొద్దిమాసాల్లోనే మూర్తికి జామ్‌షెడ్ పూర్‌లో ఉద్యోగమయినసంగతి తెలిసి సత్యం చాలా సంతోషించాడు.

దసరా సెలవలకు సత్యం యింటికి వచ్చాడు. రోజులు సరదాగా గడుస్తున్నాయి. తిరిగి ఆఖరుసారికి కాశీప్రయాణం దగ్గరపడుతూంది. మరునాడు ప్రయాణం

అనగా దిగువరోజు సాయంకాలం రాధమ్మగారింటికి వెళ్ళాడు. సత్యం వెళ్ళేటప్పటికి జగన్నాథంగారు పడుకుని వున్నారు. రాధమ్మ, ఆయన పక్కమీదనే కూర్చునివుంది.

సత్యం ఆశ్చర్యంతో 'ఏమీ, వంట్లో బాగు లేదా?' అన్నాడు. జగన్నాథంగారు, నీరసంగా నవ్వుతూ, 'రావోయ్ అల్లుడూ! దా, కూచో. ప్రయాణం కాబోలు' అన్నారు. అవాళ ప్రొద్దుటినుంచీ జగన్నాథం గారికి సుస్తీగావుందని రాధమ్మ చెప్పింది. ఈసంగతీ, ఆసంగతీ మాట్లాడుకున్నారు.

జగన్నాథంగారు, ఆప్యాయంగా, సత్యంచేయి తనచేతిలోకి తీసుకొని 'ఇకనేముంది, మరో ఆరు మాసాల్లో చదువు పూర్తిచేస్తావు. మూర్తిలాగునే సంవత్సరంలోనే ఉద్యోగం సంపాదిస్తావు. పెద్ద యింజినీరువయి మీ నాన్నగారిలాగునే మంచిగౌరవం సంపాదించాలని ఆశీర్వదిస్తున్నా, బాబూ! నీ మొహంఎదట చెప్పకూడదుకాని, భగవంతుడు నీకు మంచిగుణాలను ప్రసాదించాడు, మంచివంశంలో జన్మించావు. అందుకు తగ్గట్టు, అందర్నీ సంతోషపరుస్తూ చక్కగా పైకి వస్తున్నావు. మళ్లెమొక్క గడ్డిపువ్వెందుకు పూస్తుంది! నిన్నెప్పుడూ ఇద్దరం తలుస్తూ, సంతోషిస్తూంటాం.

'ఏదో చాదస్తంగా మాట్లాడుతున్నా. ఈ

యిరవై ఏళ్లలో ఎప్పుడూ నే నిలా సుస్తీపడలేదు. ప్లీడరుగారింట్లో చేరి ముప్ఫైమూడేళ్లు దాటింది. ఇది వరకు నీరసమన్నది ఎరగను. కాని పూర్వపుటోపిక యిహ తగ్గుతూందోయ్, అల్లుడూ. నాకు మీ అత్త తప్ప యింకెవ్వరూ కావలసిన బంధువులు లేరు; మూర్తి ఒక్కడే నీలాగు ఆదరపడతాడు. ప్లీడరు గారి కుటుంబమూ, ఈ ఆరేడేళ్ల పట్టీ మీకుటుంబమూ, మీరే మాకు బంధువులూ, ఆప్తులున్నూ. పంతులు గారూ పెద్దవారైనారు. వారికీ యిహ ఆట్టే ప్రాక్టీసు చెయ్యాలని లేదు; పిల్లలు చేతికందివచ్చారు. నేనూ ఇహ విరమించుకుంటాను. ఏదో సజావుగానే వెళ్ళిపోయింది యిన్నాళ్లూ.

'ఆ కాశీయాత్రకూడా నువ్వూ, మూర్తీ బాగా జరిపించేశారు. ఆహా, ఎప్పుడూ మరిచిపోము. నా కింకేం కోరికలుంటాయి' అంటూ రాధమ్మ వేపు తిరిగి, 'పాపం, యింకా చిన్నది; మీ అత్త చాలా దొడ్డమనిషిసుమీ. నా మీద అభిమానంకొద్దీ యిన్నేళ్లూ పుట్టింటికేనా వెళ్లలేదు' అని ఏదో బాధగా అన్నారు. ఆయన కళ్లలో నీళ్లు తిరిగాయి.

ఆ మాటలతీరూ, దృశ్యమూ సత్యానికి విస్మయమూ, విచారమూ కలిగించాయి. సత్యం ఏమనాలో తెలియక, కాస్త కంగారుతోనే 'త్వరలోనే నయ

మవుతుందిలెండి. నిమ్మళంగావున్న సంగతి వ్రాయించండి. వస్తామరి' అని వెళ్లాడు. ఇంటికి వెళ్ళేముందు బజారు నుంచి బత్తాయిపళ్ళూ, ద్రాక్షపళ్ళూ కొని తెచ్చి, పార్వతితో, 'పాపం, జగన్నాథంగారికి సుస్తీగావుంది. ఎందుకో, కాస్త అధైర్యంగా మాట్లాడినట్లనిపించింది; జ్వరంగాబరా అయివుంటుందిలే. కనుక్కుంటూండేం ? రేపు పెందరాళే ప్రయాణం; మళ్లీ చూడ్డానికి వీలుండదు. ఈ పళ్ళు వాళ్ళకియ్యి. ఉత్తరాలు రాస్తూండేం ? మూర్తికంపెనీకూడా యీమాటు లేదు; అసలే తోచదు' అన్నాడు.

కాశీచేరిన మాసం రోజుల్లోగానే, పాపం, జగన్నాథంగారు, అనుకోకుండా, మరణించినట్టు యింటివద్దనుండి ఉత్తరంవచ్చింది. సత్యానికి తట్టుకోలేని పెద్ద ఘాత తగిలినట్లనిపించింది. మాట్లాడుకోడానికి మూర్తిఅయినా లేడు. జగన్నాథంగారి పై ఆప్యాయతేకాకుండా, సత్యానికి చాలా గౌరవంకూడా వుంది. ఆయనన్న ఆఖరుమాటలు గుర్తుకొచ్చి దుఃఖావేశం కలిగింది. పాపం, రాధమ్మకు ముందెట్లావుంటుందో ? ఇంటికి వెళదామా, అనిపించింది. కాని తాను వెళ్ళి చేసేదేమిటి ? ప్లీడరుగారి కుటుంబం ముఖ్యంగా అన్ని విధాలా ఆపత్సమయంలో ఆదుకున్నారనీ, రాధమ్మను పుట్టింటివారు తీసుకువెళ్లారనీకూడా ఉత్తరంలో వ్రాశారు.

ఏదో మనసులో భారంగా వుంది. తన బాధని కాని, సానుభూతిని కాని ఎవరికి తెలియచెయ్యడం? రాధమ్మకే వ్రాద్దామంటే ఏదో ఆందోళనతో చెయ్యి వెనకకు లాగుతూంది. రెండు మూడు రోజులవరకూ విచారమూ, దిగులుతో చాలా బాధపడ్డాడు. పార్వతికీ, మూర్తికీకూడా రాధమ్మగారికి తన విచారమూ, సానుభూతి తెలియచేయమని . అన్ని సంగతులతో వ్రాశాడు. ఎప్పటివలెనే రాధమ్మతో సరదాగా మాట్లాడుకోవడంకాని, జాంబచెట్టు ఎక్కి కూర్చోవడం కాని ఇక యింటికివస్తే వుండవుకదా అని తట్టింది. కాని, సున్నితహృదయంకల సత్యాని కీతలంపు స్వార్థంతో కూడినదేమో అనే అనుమానంకూడా వేసి మధన పడ్డాడు. ఉండుండి, ఆ ఆలోచనమటుకూ తడుతూనే వుంది.

ఒడుదుడుకులు ఉంటూనే వుంటాయి; తిరిగి ప్రశాంతతా వుంటుంది. జీవితపు తీరే అంత. ఆఖరిపరీక్షలు సమీపిస్తున్నాయి. సత్యం శ్రద్ధగా, ఓవిధమైన ఏకాగ్రతతో చదువసాగేడు. పరీక్షలారంభమైనాక, మూర్తి వద్దనుండి, కంపెనీపనిమీద కలకత్తావచ్చినట్టూ, వారం, పదిరోజులు — బహుశా సత్యం పరీక్షలయ్యే వరకూ — తానక్కడ ఉండవలసి ఉంటుందనీ, సత్యం

ఎప్పుడు బయలుదేరేదీ వ్రాస్తే స్టేషనుకు వస్తాననీ ఉత్తరం వచ్చింది.

ఈమధ్యెప్పుడూ లేని ఉత్సాహం కలిగింది. ఇక నాల్గురోజుల్లో పరీక్ష లైపోతాయి. కాశీనివాసమూ, చదువూ పూర్తిఅవుతాయి. తోవలో మూర్తిని కలుసుకొని, ఇంటికి త్వరలోనే వెళ్ళడమంటే ఉల్లాసంగానేవుంది. ఈ అయిదారేళ్లూ ఎంత సరదాగా గడిచి పోయాయి! భవిష్యత్తుగురించి ఊహించడానికే మనస్కరించడంలేదు. పరీక్షలయాక బయలుదేరేటప్పుడు మాత్రం, ఈ నాల్గు సంవత్సరాలూ తోడివిద్యార్థులతో అప్పుడప్పు డెన్ని చిన్నచిన్న విమర్శనలు చేసినా, కాశీఅన్నా, విశ్వవిద్యాలయంఅన్నా ఏదో బంధం ఏర్పడినట్లనిపించింది.

హౌరాస్టేషనులో దిగేటప్పటికి మూర్తి అవుపించాడు. ఇద్దరికీ చాలా ఉత్సాహంకలిగింది. తాను భవానీపూర్ 'ఆంధ్రా హోమ్'లో వుంటున్నాననీ, సత్యాన్నికూడా అక్కడే బసచెయ్యమనీ చెప్పి, మూర్తి బసకు టేక్సీ మాట్లాడాడు. రెండుమూడు రోజులు కలకత్తాలో బాగా కాలక్షేపంచేశారు. పార్వతికి చీరను వాచీ కొనడానికిద్దరూ కలిసేవెళ్లారు. మరో పాతిక రూపాయలు హెచ్చుఖరీదైనా, యిదే బాగుంటుందంటూ మూర్తే వాచీ, స్త్రీపూకూడా సెలెక్టుచేశాడు.

సత్యం మరునాడు ప్రయాణమనగా క్రిందటి రాత్రి వెన్నెట్లో డాబామీద కూర్చుని చాలాసేపు మాట్లాడుకున్నారాత్మీయంగా, యిద్దరు మిత్రులూ. ముఖ్యంగా రాధమ్మగురించీ, జగన్నాథంగారిగురించీ ఆవేదనతో ప్రసంగించాడు సత్యం. అకస్మాత్తుగా జ్ఞాపకంవచ్చి 'ఫ్లూట్ ప్రాక్టీసు చేస్తున్నావా సత్యం? మొన్న బాగున్నట్టుకనిపిస్తే నీకోసం ఓఫ్లూట్ కొన్నాను' అన్నాడు మూర్తి. సత్యానికి చటాలున పాతస్మృతులు–తను ఫ్లూట్ మీదా, రాధమ్మ హార్మోనియమ్ మీదా కలిసి పాడడం — జ్ఞాపకం వచ్చాయి. సత్యం ఊరుకోవడం చూచి, 'అలా ఊరుకున్నావేం? అంత సరదాగా వాయించేవాడివి?' అన్నాడు మూర్తి. 'అబ్బే, ఏం లేదు; చాలా థాంక్స్, మూర్తీ' 'అన్నాడు సత్యం. సాగనంపడానికి మూర్తి స్టేషనుకువచ్చి, 'నేనుకూడా సెలవుమీద త్వరలోనే వస్తున్నాలే' అన్నాడు.

సత్యానికింటివద్ద పూర్వపు సరదా, ఉత్సాహమూ కలగలేదు. రాధమ్మ లేకపోవడం చాలా లోపం కలిగించింది. జామిచెట్టుకేసి వెళ్ళడానికే మనస్కరించడంలేదు. పార్వతితోమటుకూ ఆత్మీయంగా అన్ని సంగతులూ చెప్పసాగేడు. వచ్చిన నాలుగైదురోజుల లోనే పార్వతికి వివాహం నిశ్చయమైనట్టూ, పెళ్ళి

ప్రయత్నాలు సాగుతున్నట్టూ తెలుసుకొని విస్మయ పడ్డాడు.

వాళ్ళ నాన్నగారే సత్యంతో 'పార్వతికి మీ మూర్తినిచ్చి వివాహం నిశ్చయమయింది, తెలుసును కదూ?' అన్నారు. అన్నివిధాలా కోరతగినదీ, సంభవమైనదినీ్న, కాని ఎందుచేతనో సత్యానికి విషయం ఎప్పుడూ సహజంగా తట్టవలసినట్టు తట్టలేదు. అందుచేత చాలా ఆశ్చర్యపడ్డాడు. మూర్తే తన ఉద్దేశం మొదట రాధమ్మకి తెలియచేశాడనీ, పార్వతీ, తన తలిదండ్రులూ ఇష్టపడ్డారని తెలుసుకున్న తరువాత, మూర్తి తలిదండ్రులకుకూడా రాధమ్మే తెలియచేసిందనిన్నీ, మెల్ల మెల్లగా తెలుసుకున్నాడు.

సత్యానికి సంబంధం నిశ్చయించడం బహు ఆనందంగావుంది, కాని ఇంతవరకూ మూర్తికాని, మరెవరుకాని స్పష్టంగా తనకు సూచించలేదేమా అని కొంచెం నొచ్చుకున్నాడుకూడాను. కాని వెంటనే, ఈ ఒకటిరెండు సంవత్సరాల్లోనూ వాళ్ళమ్మా, నాన్న గారూ మూర్తిగురించి ప్రసంగిస్తూవచ్చే ధోరణీ, పార్వతీ, మూర్తులయొక్క అన్యోన్యతనూపట్టి గ్రహింపక పోవడం తన తెలివితక్కువేమోనని తట్టింది.

ఆమధ్య తను కాశీలో వున్నప్పుడు, మూర్తి తలిదండ్రులు రాధమ్మగారింటికివచ్చి, తమయింటికి

కూడా వచ్చారని ఇంటివద్దనుంచి వ్రాసినసంగతికూడా గుర్తుకొచ్చింది. తమ కుటుంబానికీ, మూర్తివాళ్ళ కుటుంబానికీ బంధుత్వంలేదు; నిజమే. శాఖాభేదాలీ రోజుల్లో ఎవరూ అంతగా పాటించరు; పాటించవలసిన అవసరమూ లేదు; బహుశా అట్టి భేదా లంతరించవలసిన అవసరముందేమో. యదార్థానికి శాఖాభేదా లెటువంటివో సత్యానికి కాని, మూర్తికి కాని అసలు తెలియనే తెలియవు. అటువంటప్పుడు, అన్నివిధాలా వాంఛనీయమై, అతి సహజమైన ఈవిషయం ఇంతవరకూ తనకు తట్టనందుకు కొంచెం సిగ్గుపడ్డాడు.

తాను గ్రహించేవుంటాడని భావించినా ఒక్కరైనా — పోనీ, మొన్న కలకత్తాలో మూర్తిఅయినా— కాస్త సూచించి ఉండకూడదా అనే భావంమటుకూ పూర్తిగా పోలేదు. ఏమయినా, చాలా యోగ్యమైన సంబంధం; చెల్లాయి అదృష్టవంతురాలని ముచ్చటపడ్డాడు. వాళ్ళ నాన్నగారే చెప్పారు : మూర్తి తలిదండ్రులు వివాహాలాంఛనాలూ, వగైరా అన్ని విషయాల్లోనూ చాలా గౌరవంగానూ, పెద్దమనిషితరహాగానూ మాట్లాడారనీ, ఏమయినా, మూర్తి కట్నం తీసుకోనన్నాడనిన్నీ, పార్వతికి వివాహసమయాన తామివ్వదలచిఉంచిన మూడువేలూ పార్వతిపేరనే ఉంచమన్నారనిన్నీ; పార్వతిమాత్రం వధూవరు లిరువురి

పేరా బ్యాంకులో వెయ్యమన్న ఉద్దేశం కనపర్చిందని కూడా చెప్పారు. సత్యం చాలా సంతోషించాడు.

వివాహ ప్రయత్నాలూ, శుభలేఖలూ వగైరా విషయాల్లో సత్యం ఉత్సాహంగా పాల్గొనసాగేడు. రాధమ్మగారికీ ఆమె పెత్తల్లిగారి కుటుంబానికీ శుభలేఖలతోపాటు ప్రత్యేకంగా ఉత్తరాలుకూడా వ్రాయించాడు. పెళ్ళి పందిరితో, గుమ్మాలకు పసుపు కుంకుమతో, తోరణాలతో ఇల్లు కలకల్లాడుతూ మంగళ ప్రదంగావుంది.

పెళ్ళికిముందురోజు మగపెళ్ళివారంతావచ్చారు. రాధమ్మా, ఆమెతల్లీ, పెత్తల్లీ, పిల్లలూ అంతా వచ్చారు. దగ్గరలోనే సదుపాయంగా విడిది. సత్యం రాధమ్మను చూచి సంవత్సరం కావస్తూంది. ఈమాటు ఆమెను కలుసుకున్నప్పుడు ఆమె తల్లికూడా అక్కడే వుంది. సత్యానికి సంతోషమూ, ఈమధ్య కలిగిన కష్టానికి విచారమూ కూడా కలిగాయి. రాధమ్మకూడా కళ్ళనీళ్ళు పెట్టుకున్నా సత్యాన్ని చూచి చాలా సంతోషించింది. రాధమ్మతల్లి సత్యంతో ఎంతో ఆప్యాయంగా రాధమ్మ ఎప్పుడూ అతనిగురించీ, వాళ్ళ కుటుంబాన్నిగురించీ చెబుతూందని అంటూ మాట్లాడింది. రాధమ్మలో సత్యానికి మార్పేమీ కనపడలేదు. పూర్వపువలెనే చనువుగా మాట్లాడింది.

అవాళరాత్రి సత్యం, రాధమ్మా చాలాసేపు వరకూ అన్నిసంగతులూ మాట్లాడుకున్నారు. జగన్నాథంగారిగురించి వచ్చినప్పుడు రాధమ్మ 'నిన్ను చూచి ఎంత ముచ్చట పడేవారనుకున్నావు సత్యం! ఎప్పుడూ నిన్ను మెచ్చుకుంటూనే ఉండేవారు. ఈ సంబంధం నిశ్చయమై మీకుటుంబంతో బాంధవ్యం కలుగుతూందని ఎంత సంతోషించారనుకున్నావు! చాలా ఎన్నికైన స్వభావమాయనది. ఒక్కసారికూడా నాతో కఠినంగా మాట్లాడలేదు; నాకెట్టి లోపమూ కలగనివ్వలేదు. సుస్తీగా వున్నప్పుడు నాతో 'నాకు బాగా గడిచిపోయింది. నీగురించితప్ప నాకేచింతా, కోరికా లేదు' అన్నారు. ఈమాటలని, రాధమ్మ కళ్ళు తుడుచుకొని, 'మనకు భగవంతుడు పిల్లలను ప్రసాదించలేదు; కోరికవుంటే, తప్పకుండా ఎవరినేనా కావలసినవారిని పెంచుకో' అన్నారు. రెండెకరాల భూమీ, భీమా మొత్తంతో కలిసి పదిపన్నెండువేలూ నాకే చెందేటట్టు ప్లీడరుగారి ద్వారా ఏర్పాటుచేశారు. పాపం, పంతులుగారుకూడా ఎప్పటి అభిమానమూ, దయా మాయందు కనపరుస్తూనే వున్నారు' అని చెప్పింది.

తరువాత వీరిద్దరి కుటుంబాలకీ స్నేహంకలియడం మొదట్లో రాధమ్మకూ, సత్యానికీ పరిచయం అయిన

పరిస్థితులూ, అన్నీ నవ్వుతూనే కాస్త వేదనతో తలుచుకొని మాట్లాడుకున్నారు.

క్లుప్తంగానే అయినా, నిర్విఘ్నంగా, లాంఛనాలకూ, వేడుకలకూ ఎట్టిలోపమూ లేకుండా, శోభాయమానంగా పార్వతీ, మూర్తుల వివాహం జరిగింది. వచ్చిన పెద్దవాళ్ళంతా శాఖాంతరవివాహాన్ని అభినందిస్తూ, జత బాగాకుదిరిందని వధూవరులను ప్రశంసిస్తూ, సంతోషంగా ఆశీర్వదించారు. నూతనదంపతులిరువురి పేరా మూడువేలతోపాటు కొత్తకాపురానికి కావలసినవి కొనుక్కోడానికిగాను మరో అయిదువందలు వధువుతలిదండ్రు లిచ్చారు.

రాధమ్మ పార్వతికి చీరె, సొగసైన వెండి కుంకుమభరణీ, మూర్తికి సూటుబట్టా ఇచ్చింది. సత్యం చెల్లాయికి రిస్టువాచీ ఇచ్చినమీదట, మూర్తి, 'చూచారా, చెల్లాయంటే సత్యానికెంతఆపేక్షో? నాకేమైనా ఇచ్చాడా? చెల్లాయికైతే బహుమతి ఇవ్వడానికని కాశీలో ట్యూషన్లుకూడా చెప్పి ఆర్జించాడు' అన్నాడు.

ఈసంగతి పార్వతికీ తన తలిదండ్రులకూ తెలిసిపోయిందని సత్యం సిగ్గుపడ్డాడు. కాని వెంటనే 'అసలు వాచీని మూర్తే సెలెక్టు చేశాడు కలకత్తాలో, పాతిక రూపాయలు హెచ్చువేయించి తన భార్యకని! ఎంత

గడుసువాడో చూచారా? పెళ్ళికాకముందే ప్రెజెంటు చేశాడు పార్వతికి తనదీ, పార్వతిదీ ఫొటోలతో ఆల్బమ్!' అన్నాడు. మూర్తి, పార్వతీ కూడా చాలా లజ్జితులైనారు. అంతా వేడుకగా నవ్వుకున్నారు.

వధూవరులు పెద్దలకు పాదనమస్కారము చేస్తూ, రాధమ్మకుకూడా పాదనమస్కారం చేశారు. ఆమె ఆనందాశ్రువులతో దీవిస్తూ, 'సత్యం, నిన్నుకూడా ఇలాగే త్వరలో దీవించాలిమరి' అంది. సత్యం సిగ్గుతో చూపులు దించుకున్నాడు.

గృహప్రవేశానికి తరలివెళ్లేముందు రాధమ్మతో మూర్తి, అక్కడ సదుపాయమైన ఇల్లు చూచాననీ, తప్పకుండా తమతో జామ్‌షెడ్‌పూర్ వచ్చి రెండు నెలలేనా ఉండాలని కోరుతూ చెప్పాడు. సత్యంతో కూడా, ఉద్యోగంఅయ్యాక సెలుండడం కష్టసాధ్యం గనుక, ఇప్పుడే తప్పకుండా రావలసిందనీ మరీ, మరీ చెప్పాడు.

పెళ్లివారంతా వెళ్లిపోయారు. పార్వతి వెళ్ళడం ఇల్లు మరీ చిన్నపోయింది. సత్యానికి మొదటినుంచీన్నీ చెల్లాయంటే అమిత అభిమానం. సరే, సుఖంగా వుంటుంది; తరుచుగానే పుట్టింటికి వస్తూంటుందికదా అనుకున్నాడు. రాధమ్మకూడా వెళ్ళిపోయింది. వెళ్లే ముందు, సత్యం 'మీరుకూడా అంత తొందరగా వెళ్లి